Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు
జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



హంతకురాలు కాకపోయినా చావుకు బాధ్యత లక్ష్మిపార్వతిదే!

# ఎన్టీఆర్ మరణంలో ఎన్నో ప్రశ్నలు!

ఎన్టీఆర్ జీవితమెంత మహోజ్వలంగా, జాజ్వల మానంగా, మహిమాన్వితంగా, నిరుప మానంగా గడిచిందో ఆయన మరణం అంత దయనీయంగా, జాలిగొల్పే రీతిలో జరిగి పోయింది. సజీవంగా ఆయన మహార్జాతకుడు; నిర్జీవ సమయంలో అత్యంత దురదృష్ట వంతుడు. ఎన్టీఆర్ వంటి ఘనతర ప్రతిభాశాలికి, మహత్తర చరిత్ర సృష్టి కర్తకు, మహోదాత్త కళా ప్రావీణ్యుడికి సంప్రాప్తించ కూడని చరమాంకం ఇది.

స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అంటారు. ఎన్టీఆర్, లక్ష్మి పార్వతిల ప్రణయ, పరిణయ వృత్తాంతంలో ఈ ఆర్యోక్తి అక్షరాలా నిజమైంది. ఎక్కడో మారుమూల పాఠాలు చెప్పుకొంటూ ఏ వీధి వాకిటి మీదో నిలబడి, అర్థరాత్రి వరకు హరికథలు విన్పిస్తూ, అనామకంగా బ్రతుకు తుండిన లక్ష్మి పార్వతికి అర్థ శరీరమిచ్చి, అగ్రాసనం వేసి, అందల మెక్కించిన పాప ఫలితం రామారావు గారు తన జీవిత చరమ దశలో ప్రత్యక్షంగా అనుభవించారు; తన చావులో చవి చూశారు; తన అంతిమ యాత్రలోనూ ఆవేదన భరించారు; తన ఆత్మ పరలోకం వెళ్లే వరకు ఆక్రోశించారు; ఆయన్ను చూసి నిజంగా జాలి పడాల్సిందే. ఆయన మరణానికి ఒక కన్నీటి బొట్టు విడిచి అంజలి ఘటిస్తే - ఆయనకు, ఆయన శవానికి పట్టిన ఈ దుర్గతి తల్చుకొని రెండు కళ్లనూ తడిచేసు కొంటున్నారు అభిమానులు. రామారావు గారి వంటి ధీరోదాత్తుడి మరణం ఇంత వివాదం కావడం పూర్వజన్మ పాప సంచితమే!

అదటుంచితే ఆయన మరణానికి కారణమేమిటన్న ప్రశ్నకు కూడా సమాధానం లభించడం లేదు.

## హిందుజాల నుంచి అందిన నాలుగు కోట్ల ఎన్ని కల నిధి, ఎప్పుడు ఎట్లా అదృశ్యమైంది?

అందులో ఎన్నో ప్రశ్నలు విన్పిస్తున్నాయి; ఎన్నో అనుమానాలు కల్గి తున్నాయి; ఎన్నో వివాదాలు తలెత్తు తున్నాయి; ఆయన మరణానికి కారణం తెలియదు; మరణించిన సమయం తెలియదు; మరణ వార్త వెలికి రాగుండా ఎందుకు ప్రక్క వుంచబడిందీ తెలియదు; మరణ సమయంలో ప్రక్కన ఎవరెవరు వుండినారో ఏమి చేస్తుండినారో తెలియదు; మరణానికి ముందు వైద్య సహాయం ఎందుకు అందలేదో, డాక్టర్లను ఎందుకు పిలువలేదో తెలియదు; అన్నీ ప్రశ్నలే. అన్నీ అనుమానాలే. వీటన్నింటికీ సమాధానం తెలిసింది, చెప్ప గల్గింది చెప్పకుండా దాచి పెడుతున్నదీ, తన రాజకీయ భవితవ్యానికి అనుకూలంగా అందమైన అబద్ధాలతో తప్పుదారి పట్టించ బోతున్నదీ లక్ష్మి పార్వతి ఒక్కరే. కొందరు ఆరోపించినట్లు ఆమె హంతకురాలు కాక పోవచ్చు; కాని ఎన్టీఆర్ చావుకు, శవ రాజకీయానికి, మరణ వివాదానికి బాధ్యత ఆమెదే. అందులో సందేహం లేదు.

ఎన్టీఆర్‌ది సుదృఢ శరీరం; లోహ సదృశ మానసం. దశాబ్దాల కఠోర వ్యాయామం, పరిశ్రమ, నియమ నిబద్ధతలు, క్రమ శిక్షణలతో తీర్చి దిద్దుకొన్న జీవన విధానము, విశిష్ట వ్యక్తిత్వము ఆయనవి. డాక్టర్ పిలుపు అందేలోగా ప్రాణం అనంత వాయువుల్లో కలిసి పోయే బలహీన దెప్పుడయ్యా డాయన? వేకువన లేచి, వ్యాయామం చేసే సమయంలో గుండె నొప్పి వచ్చి కుప్ప కూలి పోయారని చెప్పింది - లక్ష్మి పార్వతి మొదట. కాని అది నిజం కాదు. ఆయన వ్యాయామం ప్రారం భించేది ఉదయం 3 గంటల ప్రాంతంలో. ఆ తొలి ఝామున ఆయనకు మాలీషు చేసే వ్యక్తి వచ్చే సరికే ఆయనలో ప్రాణం లేదు. అదిగాక ఆయన మరణించింది తన పడక గదిలో, తన మంచం మీదనేనని చెప్తున్నారు; డాక్టర్ మహాలక్ష్మి వచ్చే సరికే ఆయన పడక గదిలో శవమై పడి వున్నారు. వ్యాయామం చేసే గదిలో కుప్ప కూలి వుంటే, అక్కడ్నుంచి ఆయన్ను పడక పైకి ఎవరు చేర్చారు? ఆయనది చాలా భారీ శరీరం. 125 కిలోల బరువు. అంత పెద్ద కాయాన్ని లక్ష్మి పార్వతి ఒక్కరే వ్యాయామ గది నుంచి, పడక గదిలోకి మోసి, మంచం పైకి చేర్చడం అసాధ్యం. ఆమె కనీసం ప్రక్క గదిలో నిద్ర పోతుండిన చిన్న కుమారుడు జయ శంకర కృష్ణను కూడా లేపలేదు. బయట వున్న సెక్యూరిటీ సిబ్బందిని సహాయం పిల్చినట్లు సాక్ష్యం లేదు.

అందువల్ల ఎన్టీఆర్ తన మంచం పైనే తుది శ్వాస విడిచి వుండాలి. అదే నిజమైతే లక్ష్మి పార్వతి మొదట వ్యాయామ సమయంలో పడిపోయినట్లు ఎందుకు చెప్పారు? ఈ తప్పుడు వార్తకు కారణ మేమిటి? మంచం మీదనే, నిద్రలో మరణించి వుంటే, గుండె పోటు వచ్చినప్పుడు ఎవరైనా గిలగిల కొట్టుకుంటారు. ఆయన గదిలోనే ఆయన ప్రక్కనే వున్న లక్ష్మి పార్వతికి అలికిడికి మెలకువ రాలేదా? వస్తే ఆమె వెంటనే డాక్టర్‌ను ఎందుకు పిలవ లేదు?

తొలుత ఆమె డాక్టర్ మహాలక్ష్మికి ఫోన చేయించారు. అప్పుడు సమయం 3.45 ప్రాంతం. వ్యాయామం చేయించ డానికి మనిషి వచ్చిన సమయం 3 గంటల లోపే! ఈ మధ్యలో కొందరు వ్యక్తులు లోపలకు వచ్చారట. వారెవరు? వచ్చి ఏమి

కొరవ 7 పేజీలో



# నిర్యాణం



జననం : 20-06-1916 మరణం : 22-01-1996

# శ్రీ యేటూరి రామారెడ్డి గారు

(ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీన్యాయవాది)

అమెరికా (యు.ఎస్.ఏ)లోని లాస్ ఏంజిలిస్
నగరంలో స్వగృహములో ౧౯౯౬ జనవరి ౨౨వ తేదీ
స్వర్గస్థులైనారని తెలియ పరచడానికి చింతిస్తున్నాము
మహోన్నత వ్యక్తిత్వం, కార్యదీక్ష కలిగిన ఆయన అకాల మరణం
మాకు తీరని లోటు. ఆయన ఆత్మకు శాంతి చేకూరాలని ప్రార్థిస్తూ....

**యేటూరి రామచంద్రారెడ్డి, ఛైర్మన్**

## యేటూరి గార్డెన్స్ లిమిటెడ్

భూదేవమ్మ – భార్య
శ్రీనివాస రెడ్డి – కుమారుడు
గోపాల్ రెడ్డి – కుమారుడు

**హైదరాబాద్**

శ్రీధర్ రెడ్డి – కుమారుడు
లక్ష్మీకాంత – కుమార్తె

# ఛీ.. ఛీ.. ఇంత నైచ్యమా?

వీధిలో అనాధ శవానికి గుడ్డ కప్పి, దారిన పోయే వారి దగ్గర చిల్లర పైసలు అడుక్కు తినే కడజాతి భిక్ష గాళ్లకంటె హీనంగా ఎన్టీఆర్ శవాన్ని టివిల్లో చూపించి రాష్ట్ర ప్రజల నుంచి ఓట్ల ముష్టి ఎత్తు కోవడానికి ఇటు లక్ష్మి పార్వతి, అటు హరికృష్ణ వారి వారి అనుచర గణం పడిన పాట్లు పరమ హేయంగా వున్నాయి. ఛీ. ఛీ.. అన్పించాయి.

ఎంత నైచ్యం వారి ప్రవర్తన? ఎంత జుగుప్సా కరం వారి వైఖరి? ఎంత సిగ్గు చేటు వారి మాటల తీరు? ఎంత దగుల్బాజీ తనం వారి డ్రామాలలో? తమను జనం చూస్తున్నారని, ఛీత్కరించు కొంటున్నారని, అసహ్యించు కొంటున్నారని వారికి తెలియ లేదా? అంతగా అధికార దాహంతో కలుషితమై పోయాయా వారి మానసాలు? అంతగా ధన పిచ్చితో మూసుక పోయాయా వారి నేత్రాలు? అంత దళసరివై పోయాయా వారి చర్మాలు? తమను జనం చూస్తు న్నారన్న వెరపు, సిగ్గు కూడా లేని వారై పోయారా?

తమను కని పెంచిన కన్న తండ్రి కడసారి చూపుకు, శవం పై పడి ఏడవ డానికి కూడా వీలు లేకుండా తొలి రోజు లక్ష్మి పార్వతి తన అనుచర గూండాలతో శవం చుట్టూ దడి కట్టి, లబ లబ దీర్ఘాలు తీస్తుంటె విష్ణు వదనాలతో నిలబడి పోయారు ఎన్టీఆర్ కొడుకులు, కూతుళ్లు, కోడళ్లు, మనుమళ్లు, మనుమ రాళ్లు వగైరా... వగైరా...; మరు రోజు హరికృష్ణ రాగానే ఆ కసినంతా చూపించి ఆమెను ఈడ్చి బయట పారేసి నంత పనిచేశారు.

శవం దగ్గరె నిలబడి, రెండు వర్గాలుగా చీలి బండ బూతులు తిట్టు కున్నారు; చేతులు కల్పు కొన్నారు; రాళ్లు విసురు కున్నారు; చెప్పులతో సత్కరించు కున్నారు; ఆ పాద రక్షలు ఎన్టీఆర్ శవం పై పడుతున్నా పట్టించు కున్న వారు లేరు. లక్షలాది జనం ఆ శవం ఎదుట నిలబడి తమ ప్రియతమ నాయకుడి మరణాన్ని, ఆరాధ్య దైవంగా భావించే ఇష్ట నటుడి వియోగాన్ని భరించ లేక దుఃఖంతో కుమిలి పోతుంటే - భార్యగా పిలువ బడిన లక్ష్మి పార్వతి, కుటుంబ సభ్యుల మని చెప్పుకునే వారు మాత్రం ఎంగిలాకు కోసం కాట్లాడుకునే కుక్కల వలె ఒకరి నొకరు కరచు కున్నారు. ఎన్టీఆర్ పట్ల తమకే అధికారం వుందని, తామే అసలైన అభిమానులమని ప్రదర్శించుకొని జనం సానుభూతిని తమ వైపు మరల్చుకొని, ఓట్ల లబ్ధి పొందాలన్న కక్కుర్తిలో వారు ఉచ్ఛ నీచాలు మరచి ప్రవర్తించారు.

అంత కంటె వళ్లు జలదరింప జేసే జుగుప్సాకర ప్రవర్తన - డబ్బు కోసం యావ. ఎన్టీఆర్ శవం పై పేర్చిన కట్టెల మంటలు ఆరక ముందే లక్ష్మి పార్వతి ఇల్లు చేరి, గబ గబా నోట్ల కట్టలు గోతాలకు కూరి కార్లలో బయటకు తరలించింది; అవి తమకెక్కడ దక్కకుండా పోతాయోనన్న ఆదుర్దాలో తక్కిన కుటుంబీకులు పోలీసుల కోసం పరుగెత్తారు. డబ్బు కోసం ఇద్దరూ నానా గడ్డి కరిచారు.

ఆస్తికల కోసం, శవం కాలగా మిగిలిన బూడిద కోసం మరొక కీచులాట. ఇక్కడ లక్ష్మి పార్వతి ప్రవర్తన ఒక పెద్ద రాజకీయ, ప్రజా నాయకుడి భార్యగానే కాదు, గౌరవ ప్రద సాంసారిక స్త్రీ వలె కూడా సంస్కారంతో ప్రవర్తించ లేదు. వీధుల్లో బ్రతికే అలగా జాతి వారి కంటె హీనంగా - చితి పై పడి దొర్లడం, అస్థికల కోసం తపించి పోతున్నట్లు నటిస్తూ పెడ బొబ్బలు పెట్టడం, క్రింద పడి పొర్లాడడం... ఛీ.. ఛీ.. ఆ దృశ్యం వర్ణించా లంటేనే అసహ్యమేస్తున్నది. హిందూ సాంప్రదాయం ప్రకారం స్త్రీలు స్మశాన వాటికకు రాకూడదని తెలిసీ, అస్థికల నిమజ్జనం కొడుకుల ధర్మమని తెలిసీ ఆమె అంత ఆగం చేసిందంటే - ఆమె డ్రామాలకు కారణం పతి పై భక్తి కానే కాదని, ఆ రూపంలో ప్రజల సానుభూతి స్వంతం చేసుకోవాలనే కుత్సితమని సులభంగా గ్రహించ వచ్చు.

జమీన్‌రైతు

కోట్లాది జనం టివిల్లో, లక్షలాది బాహా తప్త హృదయు లైన అభిమాన ప్రజ ప్రత్యక్షంగా చూస్తున్నప్పుడు; ప్రధాని, మాజీ ప్రధానులు, ప్రతిపక్ష నేతలు, మహా మహులైన జాతీయ నాయకులు, అధికారులు, సినిమా ముఖ్యులు, పారిశ్రామిక వేత్తల సమక్షంలో వీరు ఇట్లా ప్రవర్తించడం గర్హనీయం; క్షమార్హం కాని నేరం. రామారావు గారి పై వీరికి మాత్రం అభిమానం, గౌరవం, అనురాగం వుండి వుండినా ఆయన శవాన్ని కొరుక్కు తిని, రాజకీయ లాభం పొంద డానికి ప్రయత్నించి వుండరు; ఇంట్లో దాచిన డబ్బుకు కక్కుర్తి పడి వుండరు.

రాజకీయ పరంగానే కాదు - సాంసారిక ధర్మంతో చూసినా సభ్యతా సంస్కారాలు, సాంప్రదాయ ఆచారాలు, కనీస పాటి మానవతా విలువలు విస్మరించిన వీరికి ప్రజలు ఏ శిక్ష విధించినా తక్కువే అవుతుంది. ఆ ఎన్టీఆరే ఆ క్షణంలో బ్రతికి వుంటె తన నింత అగౌరవ పరచిన వీరిని శపించి వుండే వారు. ఆయన ఆత్మ పై లోకం నుంచి ఈ నీచ, నికృష్ట రాజకీయ కల్మషాన్ని చూసి తపించి పోయి వుంటుంది. మరణంలో కూడా శాంతి మిగల్చని "తనవారి" కోసం తాను జీవితాంతం శ్రమించడం ఎంత తప్పిదమో పై నుంచి గ్రహించే వుంటా రాయన.

## జమీన్‌రైతు

25.1.1946

వెం: 0-1-6 పేజీలు:8

"మీరంతా నిర్మాణ కార్యక్రమము నమలు జరుపుచు కాంగ్రెసును బలపచండి": గాంధీజీ

"మీరందరు నిర్మాణ కార్యక్రమము నమలు జరుపుచు కాంగ్రెసును బలపరచ వలెను"

నెల్లూరు (దర్గామిట్ట 105/13 మైలు రోడ్డు హాల్టు వద్ద జిల్లాలోని పందలాది గ్రామముల నుంచి తన్ను సందర్శించుటకు వచ్చిన లక్ష మంది ప్రజలకు మహాత్మా గాంధీ ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘము వారి ద్వారా ఇచ్చిన దివ్య సందేశమిది.

కలకత్తా నుండి స్పెషల్ రైలులో బయలు దేరి దూసి, పలాసా, ఇచ్ఛా పురం, అనకా పల్లి, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, తెనాలి, బాపట్ల, చీరాల, చినగంజాం, ఒంగోలు, కావలి, బిట్రగుంట, తలమంచి మున్నగు అనేక స్టేషన్లలో మహాత్ముని దర్శన భాగ్యము కై గంటల తరబడి వేచి వున్న మొత్తం 10 లక్షల ప్రజలకు స్వరాజ్య సందేశం ఇచ్చిన మీదట, 21 మధ్యాహ్నం 12.45 గంటలకు నెల్లూరుకు ఆ స్పెషల్ రైలులోనే వచ్చారు.

బాపూజీతో పాటు ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులు, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి, కాంగ్రెస్ వలంటీరు దళం వారు ఆ స్పెషల్ రైలులోనే మద్రాసుకు వెళ్లారు.

నెల్లూరులో చారిత్రాత్మకమైన ఏసూలశెట్టి బావి సమీపమున, రైల్వే లైనుకు ఆనుకొని, అమర్చ బడిన వేదిక మీద నుండి పొంగి వచ్చిన ఆ ప్రజా సమూహాన్ని చూస్తే భూమి ఈనినట్లని పించింది. యెటు చూచినా ఒక ఫర్లాంగు పొడుగున జనం క్రిక్కిరిసి కూచున్నారు. సభా స్థలముకు అల్లంత దవ్వున వున్న సైకిల్ స్టాండులో వెయ్యికి పైగా సైకిళ్లు, కార్ల స్టాండులో సుమారు ఒక వంద కార్లు, రెండు బండ్ల స్టాండ్ ‧ లోను కలసి ఒక వెయ్యికి ఒంటెద్దు, రెండెడ్ల బండ్లు, జట్కాలు నాల్గయిదు వందలు, ఒక ప్రక్క రిక్షా స్టాండులో నెల్లూరు రిక్షాలన్నీ గూడ నిలబడిగా వున్నాయి.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

రైలు కట్ట మీదుగా, నెల్లూరుకు వచ్చే జనం ముత్తుకూరు, మైపాడు, గూడూరు, కావలి, బుచ్చి మొదలగు అనేక రోడ్ల మీదుగా 40, 50 మైళ్ల దూరమున వున్న గ్రామాల నుండి గూడ ప్రజా సముద్రం పుప్పొంగి వుత్సాహంతో, ఏ వూరు కావూరు వారు జాతీయ జెండాలు చేబూని, జయ జయ ధ్వానాలు చేసుకుంటు, బారులు బారులుగా నెల్లూరు వైపుకు త్రోసుక వస్తున్న ఆ జన సముద్రాన్ని చూస్తే తిరుపతి బ్రహ్మోత్సవాలను మరపించే ప్రజల జాతీయ మూర్తి సందర్శ నోత్సాహం వ్యక్తమైంది.

కొరవ10వ పేజీలో

# ఎన్టీఆర్ పుణ్యాన ఎందరో పేదలు ఒక పూట తిండి తింటున్నారు!

ఎన్టీ రామారావు మృతి నిజంగా అందర్నీ విషాదంలో ముంచింది. పౌరాణిక చిత్రాలలో ఆయన నటనను చూస్తే పామర జనం తమ ముందు నిజమైన దేముడే ప్రత్యక్ష మైనట్లు సంబర పడేవారు. అందువల్లే ఆయనతో పాటు పలు పౌరాణిక చిత్రాల్లో నటించిన గుమ్మడి వెంకటేశ్వర రావు, ఎన్టీఆర్‌ను కారణ జన్ముడన్నారు. 1982లో తెలుగు దేశం పార్టీ పెటినదాదిగా అహో రాత్రులు శ్రమించి ఆంధ్ర దేశమంతా తిరిగి కాంగ్రెస్ ప్రభుత్వానికి ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయ గలిగాడు. రామారావు వలె పదవిలో వుండగా అనేక ఆటు పోట్లకు, విమర్శలకు గురైన నాయకుడు ఆంధ్రావనిలో మరొకరు లేరని చెప్పవచ్చు. ప్రతి పక్షాలు ఎన్ని విమర్శలు చేసినా రెండు రూపాయల కిలో బియ్యం పథకం ఎన్నో సామాన్య కుటుంబాలకు ఒక పూట తిండి తినే భాగ్యం కల్గించింది. మద్య నిషేధం వల్ల ఎన్నో కుటుంబాల ఆర్థిక పరిస్థితి మెరుగు పడిందని ఢంకా బజాయించి చెప్పవచ్చు. 1993 లో ఎన్టీఆర్ లక్ష్మి పార్వతి వలలో పడడం, ఆమెను పెళ్లాడడం వంటి దుష్పరిణామాలు ఆయన వ్యక్తిత్వాన్ని దెబ్బ తీసాయి. రామారావు తన జీవిత కాలమంతా సంచలన వ్యక్తిగా పేరు పొందినట్లే చనిపోయాక కూడా అనేక సంచలన అనుమానాలకు కారకుడయ్యారు. లక్ష్మిపార్వతి అందించిన వైద్య పద్ధతుల వల్లే మరణం సంభ వించిందని కుటుంబ సభ్యులు ఆరోపిస్తున్నారు. అయితే ఈ కుటుంబ సభ్యులంతా ఎన్టీఆర్ అనారోగ్యంతో బాధ పడుతుంటే కనీసం ఆయన ముఖమైనా చూడలేదు. శవం

## జనవాణి

స్టేడియంలో వుండగా డబ్బు కోసం బంజారా హిల్స్‌లోని ఆయన గృహం వద్ద బాహా బాహికి సిద్ధ పడ్డారు. స్టేడియంలో మంత్రులు, మాజీ మంత్రులు తిట్టు కోవడం, కొట్టు కోవడం, చనిపోయిన నాయకుని పై కూడా చెప్పులు విసరడం వారి సంస్కారాన్ని తెలియ జేస్తున్నాయి. ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీ తరువాత తిరుగులేని జనాకర్షణ గల నాయకునిగా ప్రభంజనం సృష్టించిన ఎన్టీఆర్ పేరును ఇక ముందైనా వీధుల్లో లాగే నైచ్యానికి తెలుగు దేశం రెండు వర్గాలూ మాను కోవాలని ఆయన అభిమానులు ఆశిస్తున్నారు.

కోవూరు -బి. అనుపమ

### లక్ష్మి పార్వతిది తప్పే!

ఆంధ్రుల ఆరాధ్య దైవంగా బాసిల్లిన నందమూరి తారక రామారావు మరణం అటు సినిమా రంగానికి, ఇటు

కొరవ 8 పేజీలో

# చితాభస్మాలు తెచ్చారే కాని దాన్ని చూసిన వారు లేరు!

అధికార చంద్రబాబు నాయుడు వర్గం నాయకులు హైదరాబాద్ నుంచి ఎన్టీఆర్ చితాభస్మం కలశాన్ని ప్రత్యర్థి వర్గం కంటే మూడు రోజుల ముందుగానే నెల్లూరు తెచ్చారు. భస్మాన్ని 25 తేది నెల్లూరుకు తెస్తున్నట్లు మాజీ మంత్రి, ఎన్టీఆర్ దేశం వర్గం అధ్యక్షుడు నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి ప్రకటించిన మరునాడే రోజే అధికార పార్టీ నాయకులు దీన్ని నెల్లూరు పట్టుకొచ్చేశారు. ప్రభుత్వ అధికారులు పాటిస్తూ జిల్లా కలెక్టర్, ఎస్పీ, ఆర్డీవో ఇత్యాది అధికార గణం వెంట రాగా మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి రైలు నుండి ఈ కలశాన్ని తన చేతుల మీదుగా అందు కొన్నారు. పూలతో అలంకరించిన ట్రాక్టర్ పై కలశాన్ని రైల్వే స్టేషన్ నుండి బోసుబొమ్మ, కనక మహల్, ఎసి సెంటర్, చిన్న బజారు, పెద్ద బజారు, వి.ఆర్.సి. సెంటర్, గాంధీ బొమ్మ మీదుగా ఊరేగించి చివర్న కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ఆవరణలో చేర్చారు. అక్కడ షామియానాలు వేసి బారికేడ్లు నిర్మించి ఎత్తైన వేదిక మీద పెట్టారు. రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, ఆత్మకూరు కొమ్మి లక్ష్మయ్య నాయుడు, దేగా నారసింహారెడ్డి ప్రభృతులు ఆ కలశానికి దండాలు, దస్కాలు పెట్టారు. తరువాత వివిధ మతాల వారితో భక్తి గీతాలాపన జరిపించారు. పౌర సంబంధాల శాఖ - ప్రక్కనే మరో షామియానా వేసి ఎన్టీఆర్ ఫోటో ఎగ్జిబిషన్ ప్రారంభించింది. ఏర్పాట్లు బాగానే వున్నాయి కాని, చితాభస్మాన్ని వచ్చి చూసే జనమే కరువయ్యారు. బారికేడ్లు కట్టారే గాని అవి

**జనం లేక బావురు మంటున్న బ్యారికేడ్లు!**

నుపయోగ పడక బావురు మంటున్నాయి. మంత్రి మాత్రం ఠంచన్‌గా పెంచిన గడ్డంతో ప్రతిరోజూ ఉదయం సాయంత్రం భక్తిగీతా లాపన కార్యక్రమానికి మాత్రం హాజరవు తున్నారు. ఎన్టీఆర్ పేరు వింటేనే పరుగెత్తు కొచ్చే జనం ఈ భస్మ రాజకీయాలు తమకెందుకని దూరంగా వుంటు న్నట్లున్నారు. 26 తేది లక్ష్మి పార్వతి వర్గం వి.ఆర్.సి. గ్రౌండ్‌లో మరో భస్మ కలశం పెడుతున్నది. పెన్నలో నిమజ్జనానికి మాత్రం ఇరువురూ 27 తేదీనే ముహూర్తం పెట్టుకొన్నారు. పోలీసులు ఇరు వర్గాలకూ నిమజ్జనానికి వేరే వేరే టైములు కేటాయించారట. లేకుంటే పెన్నమ్మను నెల్లూరు విడిచి పారి పోయేట్లు చేయరా భస్మ వీర రాజకీయం నడుపుతున్న నేతలు!

### ఉచిత వైద్య శిబిరం

లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు పినాకినీ, మందాకినీల ఆధ్వర్యంలో నెల్లూరు రూరల్ మండలం కల్లూరు పల్లి గ్రామంలో 21 తేది ఉచిత వైద్య చికిత్సా శిబిరం జరిగింది. 400 మందికి పైగా రోగులను డాక్టర్లు పి. మధుసూదన శాస్త్రి, పి.వి. నరసింహ శాస్త్రి, పి. చంద్ర శేఖర్, సి. వెంకటేశ్వర రావు, పి. భారతి, ప్రేమలత పరీక్షించి వుచితంగా మందులు పంచి పెట్టారు. రెండవ విడత పల్స్ పోలియో కార్యక్రమంలో భాగంగా 344 మంది చిన్న పిల్లలకు పోలియో చుక్కలు వేసారు. ఈ కార్యక్రమానికి క్లబ్ అధ్యక్షుడు ఎ. శ్రీనివాసులు గుప్తా, కార్యదర్శి టి. సుధాకర రావు, అరేంజ్ మెంట్ కమిటీ ఛైర్మన్ ఎం. రామకృష్ణయ్య, హెల్త్ ఆఫీసర్స్ ఛైర్మన్ డాక్టర్ సి. శివకుమార్ పాల్గొన్నారు.



ఎన్టీఆర్ చితాభస్మ కలశానికి పూల మాల వేస్తున్న మార్కెటింగ్ మంత్రి టి. రమేష్ రెడ్డి; ఎదురుగా ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు, కలెక్టర్ సాంబశివ రావు, దేగా నారసింహా రెడ్డి.

## సణుగుడు

### * ఈ పాప మరణం ఎందరి పాపం?

25 తేది ఉదయం జరిగిన ప్రమాదంలో పసి పాప మరణం, అందుకు కారణమైన టౌన్ బస్ దహనం రెండూ విషాదకర మైనవే. పాలు గారే లేత బుగ్గల పసి ప్రాణం మృత్యు శకటపు లోహ చక్రాల క్రింద పడి రక్తపు మడుగులో తేలియాడడం నిజంగా హృదయ విదారక సన్నివేశం. ఆ దృశ్యం చూస్తే ఎవరికైనా కడుపు రగులక పోతుంది; ఆవేశం, ఆక్రోశం తన్నుక వస్తాయి. ఆ కడుపు కోతతోనే ఆ బస్సును తగలేసి వుంటారు.

కాని ఈ విషాదానికి కారణం కేవలం బస్సు, దాని డ్రైవరేనా? ఎంత మాత్రం కాదు. ఈ పాపంలో ఇంకెందరికో భాగం వుంది; ఈ దారుణంలో ఇంకెందరికో పాత్ర వుంది.

నెల్లూరు టౌన్‌లో బస్సు, లారీల ప్రమాదాలు అసంఖ్యాకం. పోలీసులు లెక్కలు మెయింటైన్ చేయరు గాని, వాటన్నిటినీ కూడి ప్రకటిస్తే అత్యధిక రోడ్డు మరణాల సృష్టికర్తగా నెల్లూరు టౌన్‌కు రాష్ట్రంలోనే ఫస్ట్ ప్రైజు లభిస్తుంది; అత్యంత కర్కశంగా జనాభాను తగ్గిస్తు న్నందుకు రివార్డు ఇవ్వమని కూడా సిఫార్సు చేయవచ్చు.

ఈ పాపకు జరిగిన ఘోరానికి, అంతకు క్రితం అటువంటివే అసంఖ్యాకంగా జరిగిన దారుణ మరణాలకు కారకులు, ప్రేరకులు, బాధ్యులు, నేరస్తులు నిందించ దగిన వారు చాలా మంది వున్నారు. చెప్పాలంటే ఆర్‌టిఒ ఆఫీసు సిబ్బంది

**డోలేంద్ర**

ప్రథమ హంతకులు. టౌన్ బస్‌లకు టైములు నిర్ణయించేది, డ్రైవర్లకు లైసెన్స్ లిచ్చేది, బస్‌ల కండిషన్ సరిగా వుందని ఫిట్ సర్టిఫికెట్ ఇచ్చేది వారే. ఒక్కొక్క బస్‌కు ఏడాదికి పది వేల వరకు కరకు మాయని నోట్లు అందు కోవడానికి వారికివన్నీ కేవలం మార్గాలు. ఆ లంచం చేతిలో పడకుంటే గిలగిల లాడిపోతారు; అది జేబులోకి చేరితే సర్వం మర్చి పోతారు. ఒక్కొక్క బస్‌కు ప్రయాణ కాలం, వివిధ స్టాప్‌లలో ఆగ వలసిన సమయాలు నిర్ణయించడంలో వారి అసమర్థత వల్ల బస్‌లు రోడ్డు పై పరుగులు పెట్టి,

కొరవ 7 పేజీలో

# ఎండా కాలం నీళ్ల కటకటలు రాకుండా కట్టు దిట్టాలు!

టౌన్‌లో రాబోయే వేసవి కాలంలో ఎటువంటి మంచి నీటి సమస్య ఏర్పడకుండా మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి పలు ముందు జాగ్రత్తలు తీసు కొంటున్నారు. మే, జూన్ నెలల్లో ఎండలకు పెన్నా నది గర్భంలో నీళ్ళు ఇంకి పోయి టౌన్ ప్రజలకు నీటి సమస్య ఏర్పడ కుండా వుండేందుకు సోమశిల నుండి ఒక టి.ఎం.సి. నీటిని విడుదల చేసేందుకు కలెక్టర్ నుండి వివేకానంద రెడ్డి

**మునిసిపల్ ఛేర్మన్ కమ్మగా చెప్తున్నాడు - నమ్ముదామా?**

ముందుగానే అభయం పొందారు. నీటి సమస్యను ఎదుర్కొ నేందుకు మునిసి పాలిటీ చేయబోతున్న ప్రయత్నాల వివరాలను23 తేది స్వగృహంలో విలేకరులకు సుదీర్ఘంగా వివరించా రాయన. టౌన్ ప్రజల కోసం పెన్నానది బావుల నుండి 50 లక్షల గ్యాలన్ల నీరు, 22 మినీ స్కీముల నుండి 45 లక్షల నీరు, మొత్తం కలిసి 95 లక్షల గ్యాలన్ల నీరు సప్లై స్కీముల ద్వారా ప్రజలకు ఇబ్బంది లేకుండా సరఫరా చేయ బడుతుందని చెప్పారు. గత ఏడాది రెండు వేసవి కాలాలు చూసిన అనుభవంతో సమస్యలు రాకుండా ఈసారి ఫత్తేఖాన్ పేటలో 12 అంగుళాల సైజు లైను ఏర్పాటు చేసి పంపుసెట్లు నెలకొల్పి 2 లక్షల గ్యాలన్ల కెపాసిటీ కలిగిన రిజర్వాయరు నిర్మించి టెస్టింగ్ చేస్తున్నట్లు చెప్పారు. పెన్నానది బావుల నుండి ఈ రిజర్వాయరుకు అదనంగా 6 లక్షల గ్యాలన్ల నీరు సరఫరా అవుతాయని, దీనివల్ల ఫత్తేఖాన్ పేట, రమేష్ రెడ్డి నగర్, టెక్కేమిట్ట ప్రాంతాల్లో నీటి సమస్య లేకుండా చేయ వచ్చున్నారు. బంగ్లాతోట, లింగబలిజ వీధి ప్రాంతాలకు నీటి సరఫరా చేసేందుకు కిసాన్ నగర్‌లో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన పథకం వల్ల 50 వేల గ్యాలన్ల నీరు అదనంగా సరఫరా అయ్యే వీలుంటుందని వివరించారు. హడ్కో వారి సహకారంతో నిర్మించనున్న మంచి నీటి పథకానికి 2.23 కోట్లు మంజూరై, క్లియరెన్సు వచ్చిందని, కాని హౌసింగ్ బోర్డు చెల్లించాల్సిన దామాషా 97 లక్షలు చెల్లించక పోవడం వల్ల పథకం నిలచిపోయి వున్నట్లు చెప్పారు. హడ్కో నిధులు 5 లక్షల 30 వేల రూపాయలు ఖర్చు పెట్టి జెండా వీధిలో టెస్ట్‌వెల్ త్రవ్వి తున్నారని వివరించారు. టౌన్‌లోని 507 బోర్లలో 226 బోర్లు ప్రస్తుతం రిపేరులో వున్నాయని 7 లక్షలు ఖర్చు పెట్టి ఈ మాసాంతంలోగా వాటిని రిపేరు చేయిస్తారట. 80 బావుల్లో పూడిక తీయించను 2 లక్షలు ఖర్చు పెడతారట. ఈ పనులను వార్డుల వారీగా కౌన్సిలర్లు, ఎ.ఇ., డి.ఇలు 24 తేది పర్యవేక్షిస్తారని చెప్పా రాయన.

మునిసిపాలిటీకి 18 కె.వి. జనరేటర్ వుందని, 3 లక్షలు పెట్టి దాన్ని రిపేరు చేయించాలని కౌన్సిల్ భావిస్తున్నట్లు ఛేర్మన్ తెలిపారు. 90 శాతం పన్నులను మునిసి పాలిటీ వసూలు చేస్తే ప్రభుత్వం ప్రోత్సాహపు

కొరవ 10 పేజీలో

### మంత్రి గారూ - మీ పేరు వినవస్తున్నదేమిటి?

# నెల్లూరు క్లబ్ స్థలం అన్యాక్రాంతం!

నెల్లూరు క్లబ్‌కు చెందిన 90 అంకణాల స్థలంలో రాజకీయ నాయకుల ప్రమేయంతో అక్రమ గుడిసెలు వెలిసాయి. పొదలకూరు రోడ్డు ప్రాంతంలో ఖాళీ స్థలం కనిపిస్తే కబ్జాకు పూనుకొనే రాజా, సాయి అనే తెలుగు యువ కిశోరాలు ఈ దుర్మార్గానికి పాల్పడినట్లు ఆరోపణ. ఈ ఇద్దరు ప్రబుద్ధులు 18 గుడిసెలను కొద్ది గంటల వ్యవధిలోనే అక్కడ వెలిసేట్లు చేసారట. క్లబ్ స్థలానికి ఈ దుర్గతి పట్టిందని పోలీసు రిపోర్టు ఇచ్చినా వాళ్లు మంత్రి రమేష్ రెడ్డి అనుచరులని భయపడి పోలీసులు మిన్న కుండి పోయారట. తన పేరు చెప్పుకొని దౌష్ట్యం ప్రదర్శించి భూ కబ్జాలు చేస్తున్న ఇటువంటి అనుచరులను మంత్రి మందలించి విలువైన క్లబ్ స్థలాన్ని కాపాడాలని సభ్యులు కోరుతున్నారు.

## నెల్లూరు సంగతులు

### పల్స్ పోలియో సక్సెస్

జిల్లాలో జనవరి 20 తేదిన నిర్వహించిన పల్స్ పోలియో కార్యక్రమం నూటికి నూట నాలుగు శాతం సక్సెస్ అయిందని జిల్లా కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు చెప్పారు. జిల్లాలో 2,10,892 మంది మూడు సంవత్సరాల లోపు పిల్లలకు పోలియో చుక్కలు వేయడం లక్ష్యం కాగా 2,20,428 మంది పిల్లలకు చుక్కలు వేశారట. మూడు సంవత్సరాలు పై బడిన 26,267 మంది పిల్లలకు కూడా పోలియో చుక్కలు వేసారు. టౌన్ ప్రాంతాలకు సంబంధించి 38,660 మంది పిల్లలు లక్ష్యం కాగా 41,036 మందికి 3,314 మంది మూడు సంవత్సరాలు పై బడిన వారికి చుక్కలు వేశారు. గ్రామీణ ప్రాంతాల్లో 1,72,232 మంది పిల్లలకు గాను 1,79,392 మందికి పైగా పిల్లలకు చుక్కలు వేశారు. వీరిలో మూడు సంవత్సరాల పై బడిన వారు 22,953 మంది వున్నట్లు కలెక్టర్ వివరించారు.

# కల్తీ కల్లు త్రాగి బుచ్చిలో మరో ఇద్దరు చచ్చారు!

బుచ్చిరెడ్డి పాళెం మండలంలోని కట్టుబడి పాళెం గ్రామానికి చెందిన ఇద్దరు వ్యక్తులు 23 తేది కల్తీ కల్లు త్రాగి మరణించారు. కాని వీరి మరణం పై భిన్న కథనాలు ప్రచారంలో వున్నాయి. కల్లు త్రాగిన మస్తానయ్య (55) ఒంటెద్దు బండి నడుపుతూ అకస్మాత్తుగా దాని క్రింద పడి పోయారు. ఆసుపత్రికి తరలించగా అతడి డొక్కలో ఎముక జారియానికి గుచ్చు కోవడం వల్ల మరణించాడని కల్లు వ్యాపారస్తులు కథలు చెబుతున్నారు. మరణించిన మరో వ్యక్తి బుజ్జయ్యకు (70) గుండె జబ్బు వుందని వ్యాపారస్తులే వకాల్తా తీసుకొని ప్రచారం చేస్తున్నారు. ఈ సంఘటనలు జరిగాక కట్టుబడి పాళెం గ్రామస్తులు కోపంతో రెచ్చిపోయి కల్లు కుండలను, చెట్లకు వుండిన కల్లు కుండలను పగుల గొట్టేసి నిరసన తెలియ జేశారు. గ్రామంలో కల్లు విక్రయించే వారిని గ్రామ బహిష్కరణ చేయాలని, వెయ్యి రూపాయలు జరిమానా విధించాలని సర్పంచ్ వేమయ్య నాయకత్వంలో తీర్మానించారు. ఈ మేరకు గ్రామ తీర్మానాన్ని మండల రెవిన్యూ అధికారికి కూడా పంపించారు. మండలంలో పలు గ్రామాల్లో కల్లులో రసాయన పదార్థాలు కల్తీ చేస్తున్నారనడానికి సాక్ష్యాధారాలు వున్నాయి. గతంలో ఇదే గ్రామానికి చెందిన ఒక వ్యక్తి కల్తీ కల్లు త్రాగి చనిపోయిన సంఘటనను సాక్ష్యంగా చెప్పవచ్చు. ఒక్క గ్రామానికి చెందిన ముగ్గురిని కల్తీ కల్లు బలిగొన్నా, మామూళ్లలో మునిగి తేలుతున్న కోవూరు ఎక్సైజ్ అధికారుల్లో మత్తు వీడలేదు. మరి జిల్లా వున్నతాధికారులు ఏమి చేస్తున్నట్లు? ఇంకా ఎందరి ప్రాణాలు పోవాలని వారు కోరు కొంటున్నారో అర్థం కావడం లేదు!

**ఇంకెన్ని ప్రాణాలు హరీమంటే ఎక్సైజ్ నిద్ర వదుల్తుంది?**

## బుచ్చిలో ఎన్టీఆర్‌కు నివాళి

మాజీ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు మరణం బుచ్చి రెడ్డి పాళెం ప్రజలను అమితంగా కృంగ దీసింది. ఈ వార్త వినగానే వ్యాపారస్తులు స్వచ్ఛంధంగా అంగళ్లు మూసేశారు. పలు సెంటర్లలో షామియానాల్లో ఎన్టీఆర్ చిత్ర పటాన్ని వుంచి నివాళు లర్పించారు. బస్టాండ్ సెంటర్‌లో ఆయన అభిమానులు పేదలకు అన్నదానం చేసారు. ఎన్టీఆర్ నటించిన పలు పౌరాణిక చిత్రాలను శిబిరాల్లో ప్రత్యేకంగా ప్రదర్శించారు.

## వెంకటగిరిలో పోలియో చుక్కల కార్యక్రమం

వెంకటగిరి మండలంలో వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో 20, 21 తేదీల్లో రెండవ విడత పోలియో చుక్కలు వేసే కార్యక్రమం విజయవంత మయ్యింది. మండలంలో ఏర్పాటు చేసిన 97 కేంద్రాల్లో 5481 మంది పిల్లలకు ఈ పోలియో చుక్కలు వేశారు. 4 సంవత్సరాలు పైబడిన 1155 పిల్లలకు వారి తల్లి తండ్రుల కోరిక పై పోలియో చుక్కలు వేసారు. స్వచ్ఛందంగా చిన్నల తల్లితండ్రులే పోలియో చుక్కలు వేసే శిబిరాలకు తరలి రావడం విశేషం.

# ఎన్టీఆర్‌కు ఎల్లసిరి స్పెషల్ సంతాపం

మాజీ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు మరణ వార్తతో గూడూరులో పలువురు, పలు రకాలుగా తమ విచారాన్ని వ్యక్త పరుస్తుండగా రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి కాసింత స్పెషల్‌గా సంతాపం వెలిబుచ్చి తన కృతఘ్నతను చాటారు. 18 తేది ఎమ్మెల్యే గూడూరులోని అల్లూరు ఆదిశేషా రెడ్డి స్టేడియంలో చిరంజీవి యువసేన నిర్వహించిన క్రికెట్ పోటీల్లో ముఖ్య అతిథిగా పాల్గొని పూల మాలలు వేసుకొని, ఆనందోత్సాహాలతో కాలక్షేపం చేశారు. రామారావు బొమ్మ పెట్టుకొని గెల్చిన శ్రీనివాసులు రెడ్డి ఆయన మరణం పట్ల విచారాన్ని వ్యక్తపరచక పోగా క్రికెట్ పోటీల్లో పాల్గొనడం ప్రజలు వింతగా చెప్పుకొన్నారు. ఎన్టీఆర్ అంత్యక్రియలకు హాజరైతే లక్ష్మి పార్వతి వర్గీయుడంటారనే భయంతో తాను వెళ్లలేదని ఎల్లసిరి పలువురి వద్ద తాను చేసిన తప్పును సరిదిద్దుకొను యత్నిస్తున్నా రిప్పుడు.

## ఉపాధ్యాయుని పశుత్వం

చదువు కొనేందుకు తన వద్దకు వస్తున్న బాలిక పై పాశవికంగా మరచి, అత్యాచార యత్నం చేసి పశువులా ప్రవర్తించిన ఉపాధ్యాయుని వుదంతమిది. చిల్లకూరు మండలం పెంట పాడు గ్రామంలోని ప్రాథమి కోన్నత పాఠశాలలో పనిచేస్తున్న పగిలాం భాస్కర (41) తన వృత్తికి సిగ్గు కళంకం తెచ్చి పెట్టాడు. ఆ పాఠశాలలో 7 తరగతి చదువుతున్న 12 ఏళ్ల బాలిక పై పట్ట పగలు పాఠశాలలో అత్యాచారం చేయబోయాడట. ఆ దుర్మార్గుడు బాలిక కేకలు వేయడం మరియు ప్రక్కల వాళ్లు రావడంతో

## జిల్లావార్తలు

తప్పించుకొని పారి పోయాడు. ఈ పద పిశాచి పై తగిన చర్య తీసుకోమని బాలిక తల్లి తండ్రులు చిల్లకూరు ఎమ్మార్వో, ఎం.ఇ.ఓ.కు వినతి పత్రం సమర్పిస్తే, ఆ మహాను భావులు అతనికి క్లీన్ సర్టిఫికెట్ ఇచ్చారట. గ్రామస్తులు ఇచ్చిన సలహా మేరకు చిల్లకూరు పోలిస్ స్టేషన్‌లో మరుసటి దినం ఫిర్యాదు చేయగా

కొరవ 11 పేజీలో

# కండ్లేరు ఉద్యోగాల దగా ప్రచారం?

ప్రభుత్వం మాట నమ్మి వున్న వూరు, భూములు, ఇళ్లు వదలి వచ్చేసిన కండలేరు ముంపు వాసులు నష్ట పరిహారం పొందలేక ఇప్పటికీ పడరాని పాట్లు పడుతున్నారు. ప్రభుత్వం కొత్తగా చేసిన చట్టం ప్రకారం ముంపు వాసుల కుటుంబంలో చదువుకొని వుండే వాళ్లకు వుద్యోగాలు ఇస్తామని ప్రకటించింది. అప్పటి నుండి ఛోటా నాయకుల సందడి ప్రారంభ మయ్యింది. ముంపు వాసులకు వుద్యోగా లిప్పిస్తామంటూ బయలు దేరి, జిల్లా మంత్రులతో మాట్లాడా, పోస్టింగులు గ్యారంటీ, ఖర్చుకు డబ్బు లివ్వమని వేల రూపాయలు వసూలు చేస్తున్నారు. రాపూరు గ్రామంలోనే గాక దాచూరు, పెరయు కొండ, పులికల్లు గ్రామాల్లోనూ ఈ దళారుల సందడి ఎక్కువగా వుంది. జాయింట్ కలెక్టర్ ఇటీవల ముంపు వాసుల వుద్యోగాల కోసం ఇంటర్వ్యూలు నిర్వహించారు. జిల్లా మంత్రుల పేరు చెప్పి దళారులు చేస్తున్న ప్రచారం ఆయన దృష్టికి వచ్చిందో లేదు మరి! జిల్లా అధికారులు వాస్తవ ప్రకటన చేసి ముంపు వాసులు మరోసారి మోస పోకుండా చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## సర్వేపల్లిలో కాంగ్రెస్ శిక్షణా తరగతులు

గ్రామ స్థాయిలో కాంగ్రెస్ కార్యకర్తలను వుత్సాహ పరచి పార్టీకి పటిష్టమైన కార్యకర్తల యంత్రాంగం నిర్మించ డానికి పార్టీ అధిష్టాన వర్గం శిక్షణా తరగతులను దేశ వ్యాప్తంగా నిర్వహించమని ఆదేశించింది. నూరబ్ కుంద్, గండి పేట, నాగార్జున సాగర్‌లో జరిగిన పార్టీ శిక్షణా తరగతులను ఆదర్శంగా తీసుకొని జిల్లాలో తొలిసారి ఇటువంటి చిన్న శిబిరాన్ని సర్వేపల్లిలో పిసిసి సభ్యుడు కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి పెడుతున్నాడు. 28 తేది ఉదయం నుంచి సాయంత్రం వరకు నియోజక వర్గంలో 200 మంది ముఖ్య కార్యకర్తలు శిబిరంలో పాల్గొంటారట. కాంగ్రెస్ చరిత్ర, దేశ సమైక్యత కోసం ఇందిరా గాంధి, రాజీవ్ గాంధీ చేసిన త్యాగాలు, పివి నరసింహ రావు ఐదేళ్ల పరిపాలనలో విశేషాలతో గండిపేట శిబిరం నుంచి తెచ్చుకొన్న సిలబస్‌ను శ్రీధర్ రెడ్డి కార్యకర్తల ముందుంచు తారట. శిక్షణకు వచ్చిన వారికి పిసిసి గుర్తింపు సర్టిఫికెట్లు కూడా ఇస్తా నంటున్నాడు.



# ఆరోగ్య మంత్రి మనుమళ్లకు గూడూరు స్టేషన్‌లో పోలియో మందు!

గూడూరు టౌన్‌లో రెండవ విడతగా జరిగిన పల్స్ పోలియో కార్యక్రమంలో రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖ మంత్రి డాక్టర్ మెట్ల సత్య నారాయణ పాలు పంచు కొన్నారు. కుటుంబ సమేతంగా చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో 20 తేది మద్రాసు వెళ్తుండిన మంత్రి - రైలు గూడూరు స్టేషన్‌లో ఆగినపుడు అక్కడి శిబిరంలో తన మనుమడు, మనుమరాళ్లకు పోలియో చుక్కలు వేయించారు. స్టేషన్‌లో ఈ కార్యక్రమం నిర్వహిస్తుండిన గూడూరు రోటరీ, లయన్స్ క్లబ్ సభ్యులను మంత్రి ఈ సందర్భంగా అభినందించారు.

## ఎవరివీ బర్రెలు?

గత మూడు నెలలుగా నెల్లూరు రూరల్ మండలం కలివెల పాళెం గ్రామంలో పోతల వెంకట కృష్ణారెడ్డి ఇంటికి ఎవరివో మూడు బర్రెలు చేరాయట. స్వంత దారులు గుర్తులు చెప్పి తోలుకు పొమ్మంటున్నారు కృష్ణారెడ్డి.

## పెంచలకోన ట్రస్ట్‌కు కొత్త ఛైర్మన్

రాపూరు మండలం పెంచల కోనలోని ట్రస్టు బోర్డు ఛైర్మన్‌గా పాలవల్లి శ్రీనివాసులు ఎన్నికయ్యారు. గతంలో శీనయ్య పాలక వర్గం సభ్యులుగా కొనసాగు తుండేవారు. శీనయ్య అసలైన కాంగ్రెస్ పార్టీ కార్యకర్త. ప్రస్తుతం వున్న రాజకీయ పరిస్థితులను తట్టుకొని పెంచల కోన దేవస్థానాన్ని ఎక్కడికి గలరన్న నమ్మకం భక్తులలో వుంది.

# నెల్లూరు ముచ్చట్లు

విలక్షణుడు

## జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 30 తేదీ ఉదయం తిరుపతి మీదుగా వారు వస్తారు. రాత్రికి అక్కడే మకాం. 31 తేది నెల్లూరులో వివాహాలకు అటెండెన్స్, మధ్యాహ్నం ఉదయగిరి మండలం కంపసముద్రంలో ఎమ్మెల్యే నారాయణ రెడ్డి సంతాపసభకు హాజరు. కాంగ్రెస్ కార్యకర్తలతో ముచ్చట్లు; 1 తేది వాకాడులో విశ్రాంతి; 2 తేది అక్కడే దేవాలయ సంప్రోక్షణ కార్యక్రమం; 3 తేది మళ్లీ తిరుపతి మీదుగా హైదరాబాదు.

## జంట మంత్రులు

జిల్లా మంత్రులు శ్రీ టి. రమేష్ రెడ్డి, శ్రీ బల్లి దుర్గా ప్రసాద్ నెల్లూరులోనే వున్నారు. ఎప్పుడు తిరిగి వెళ్తారో తెలియదు. బహుశా రేపు (27 తేది) ఎన్టీఆర్ చితాభస్మం పెన్నలో కలిపి, రైలెక్కు తారేమో!

## నాగభూషణమ్మ ప్లేటు ఫిరాయింపు

అన్న రామారావు చితి మంటల మీద నిప్పు ఆరక మునుపే కప్ప గంతులు ప్రారంభ మైనాయి. తన బొందిలో ప్రాణం వున్నంత వరకు అన్న వదినల పాద సేవ చేసుకొంటూ తరిస్తానని నమ్మ బల్కుతుండిన జిల్లా పరిషత్ ఛైర్మన్ డాక్టర్ నాగభూషణమ్మ అన్నను అటు స్మశాన వాటికకు సాగనంపి, ఇటు చంద్రబాబు సేవలో నిమగ్నులై పోయారు. పాపం ఆమెను ఎమ్మెల్యే చేయాలని కలలు కంటుండిన నల్లపరెడ్డి ప్రసన్న ఇప్పుడే మౌలాడో తెలియదు.

ఆమెతోటి డిసిఎంఎస్ అధ్యక్షుడు మహదాను శేషయ్య, చేకూరి బాబూ రావులు కూడా బోర్డులు త్రిప్పేశారు.

- తమ కప్ప గంతులు, పొర్లి కింతలు చూసి జనం అసహ్యించు కొంటారన్న భయం కూడా లేదేమిటండి ఇటువంటి వారికి?

## వివేకా తనిఖీలు

మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి ఆకస్మిక తనిఖీలు మళ్లీ ప్రారంభ మైనాయి. 24 తేది టౌన్‌లో పలు చోట్ల అధికార, అనుచరగణ సమేతంగా తిరిగారు. ఈ తనిఖీలో కడుపు మండే వాస్తవాలెన్నో బయట పడినట్లున్నాయి. ఒక జర్నలిస్ట్ మిత్రుడు రెండంతస్తుల మేరకు కేవలం రు. 150 ల పన్ను కడ్తుంటే, ఇంకొక ప్రబుద్ధుడు ప్లాన్, గ్లిన్ లేకుండానే నిప్పో ఎదురుగా పెద్ద కాంప్లెక్స్ కడ్తున్నట్లు బయట పడింది. డ్రైన్ల సమస్యలు, పిల్లలు లేకుండానే స్కూళ్లలో అటెండెన్స్‌లు, నీళ్లు రాని కొళాయిలు, వేయని రోడ్లకు బిల్లులు అసంఖ్యాకం. అన్ని దగ్గర్లా నిల్చి, అరిచి, ఆగం చేసి వెళ్లారు వివేకా! మునిసిపల్ అధికారుల పైన ఎంత తిట్ల జడివాన కురిపించినా, దున్న పోతు మీద నీళ్లు చల్లినట్లే లెక్క. వారు తమ తప్పులు సరిదిద్దు కోరు; లంచాలకు తమ పదవులు నడివీధిలో విక్రయించడం మానరు.

తన తనిఖీలలో వెలికి వచ్చిన దుర్మార్గాలను ఒక జాబితాగా తయారు చేసి, సంబంధిత వ్యక్తుల పేర్లతో సహా జనానికి తెల్పితే - కనీసం వారి నైచ్యమైనా పది మందికీ తెలుస్తుంది.

## టౌన్‌బస్ క్రింద పడి పసిపాప మరణం

దర్గామిట్ట, వెంకట రమణ థియేటర్ ఎదురుగా 25 తేది ఉదయం ఒక టౌన్ బస్ రోడ్డు ప్రక్కన నడిచి పోతుండిన మంజుల అనే పదహారేళ్ల యువతిని చంపింది. ముందున్న మరొక బస్‌ను ఓవర్ టేక్ చేయడానికి సర్రున దూసుక వచ్చాడట డ్రైవరు; దురదృష్టవశాత్తు ఆ పాప అక్కడ నడిచి పోతుండింది. తప్పించుకొనే వ్యవధి లేదు. తల పై చక్రాలు ఎక్కేశాయి. కన్ను మూసి తెరిచే లోపల ప్రాణం పోయింది.

కళ్ల ముందు జరిగిన ఈ ఘోరం చూసి జనం ఆగ్రహంతో మండి పడ్డారు. బస్‌ను నిలిపి, పెట్రోలు బంకు నుంచి పెట్రోలు తెచ్చి తగుల బెట్టేశారు ఫైరింజన్ వచ్చినా దరి కట్టి, దగ్గరకు రానివ్వలేదు. పోలీసులు వచ్చే సరికి బస్ మసి బొగ్గుగా మారింది. ఆ బస్ డ్రైవర్‌ను





# తూతూమంత్రంగా రిపబ్లిక్‌డే- ఒక్క ఎమ్మెల్యేకీ దేశభక్తి లేదు!

పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ప్రతి యేడాది సర్కారీ మొక్కుబడిగా జరిగి పోయే రిపబ్లిక్ డే కార్యక్రమం ఈ ఏడాది మరింత పేలవంగా జరిగింది. కార్యక్రమం పట్ల అధికారులకు శ్రద్ధ లేదన్న విషయం చేసిన ఏర్పాట్ల విషయంలో ప్రస్ఫుట మయ్యింది. అంత పెద్ద పోలీస్ గ్రౌండ్‌లో మూడంటే మూడు షామియానాలు ఏర్పాటు చేసారు. పెరేడ్‌లో ఏర్పాటు చేసిన కార్యక్రమాల్లో ఆకర్షణీయత కనిపించక పోయేసరికి అవీ నిండలేదు. మార్చ్‌ఫాస్ట్ చేసే గ్రౌండ్ చుట్టూ దట్టంగా కనిపించే మువ్వన్నెల తోరణాలు అసలు కనపడ లేదు. కట్టిన జండాలు కూడా రంగు వెలసి వెలవెల బోయాయి. పెరేడ్‌కు వచ్చే తీరిక జిల్లాలోని మంత్రులకు, ఎమ్మెల్యేలకు వుంటే కదా? ప్రజా ప్రతినిధుల్లో మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి ఒక్కరే వీఐపిలకు కేటాయించిన ప్రత్యేక సోఫాలో బిక్కు బిక్కు మంటూ కూర్చొని వుండినారు. ఆగస్టు 15, జనవరి 26 పండుగలకు ఠంచన్‌గా వచ్చే డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు అనారోగ్య కారణం వల్ల ఈసారి రాని లోటు ప్రత్యేకంగా కనపడింది. కార్యక్రమం చివరన ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాలు పెరేడ్‌లో ప్రదర్శించే స్థాయికి తగ్గట్టు లేక పోవడంతో వచ్చిన కొద్దిపాటి జనం కూడా విసుగుతో షామియానాల నుండి లేచి పోయారు.

జిల్లాకు కొత్తయిన కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు, ఈ కార్యక్రమానికి జనం హాజరు కావడం ప్రతిపౌరీ బంతిని మానవి భావించి నట్లుంది. పోలీస్ గౌరవ వందనాన్ని స్వీకరించి ఎస్పి జి. పూర్ణ చంద్రరావు వెంట రాగా 9 గంటలకు జాతీయ పతాకాన్ని ఆవిష్క రించారు. అనంతరం జిల్లా అభివృద్ధి పై పౌర సంబంధాల శాఖ తయారు చేసిన తప్పుల తడిక నివేదికను సరిచేసి కృష్ణా జిల్లా యాసలో చదివా రాయన. ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో వచ్చిన అర్జీలలో 1334 పనులకు గాను 4 కోట్ల 45 లక్షల రూపాయల విలువ మేరకు అంచనాలు తయారు చేసారని. 3.45 కోట్ల నిధులు ఇప్పటికే విడుదల కాగా, శ్రమదానం క్రింద 99 లక్షల రూపాయలతో 603 పనులు ప్రారంభ మైనట్లు చెప్పారు. జిల్లాలో ఇప్పటికే 4 లక్షల 31 వేల తెల్ల కార్డులు, లక్షా 42 వేల గులాబీ రంగు కార్డు లున్నాయి. ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో కొత్త కార్డుల కోసం దరఖాస్తు చేసిన వారికి మూడవ విడత పాలనలో కార్డు లిస్తామన్నారాయన. సంపూర్ణ మద్య నిషేధం అమలులోకి వచ్చిన తరువాత జిల్లాలో 4030 కేసులు నమోదు చేసి 45 లక్షల విలువ గల మద్యం, 15 లక్షల విలువ గల వాహనాలు పట్టు కొన్నట్లు చెప్పారు. జిల్లాలోని మహిళలు పొదుపు లక్ష్మి పథకంలో 7.5 కోట్లు పొదుపు చేయగా, డి.ఆర్.డి.ఎ. ద్వారా 43 వేల మందికి 4 కోట్ల 30 లక్షల ఋణ సహాయంగా ఇచ్చినట్లు వివరించారు. పల్స్ పోలియో కార్యక్రమం క్రింద తొలి, మలి విడత కార్యక్రమంలో 4 లక్షల 21 వేల మంది పిల్లలకు పోలియో చుక్కలు వేసారట. ఈ సంవత్సరం ఏర్పడిన వర్షాభావ పరిస్థితులు ఎదుర్కొ నేందుకు సోమశిల జలాల సక్రమ పంపిణీకి జిల్లా యంత్రాంగం అవిరామంగా కృషి చేస్తున్నట్లు చెబుతూ, కమిటీ సిఫార్సు మేరకు జిల్లాలో లొంగి పోయిన తీవ్ర వాదులకు పునరావాసానికి 2 లక్షలు ఇచ్చిన కొత్త విషయం కూడా పెరేడ్‌లో కలెక్టర్ ప్రకటించారు.

99 మంది అధికారులకు ఉత్తమ సేవ ప్రశంసా పత్రాలను కలెక్టర్ చేతుల మీదుగా అందించారు. కాని ఆ సమయంలో పెరేడ్‌లో చప్పట్లే వినిపించలేదు. కొట్టడానికి మనుష లుంటే కదా! పత్రాలు స్వీకరించే వంద మంది, ఏర్పాట్లు చేసిన సిబ్బంది, పోలీసులతోనే జరిగి పోయింది తంతు. 95 సంవత్సరంలో రాంచీలో జరిగిన ఆలిండియా అథ్లెటిక్స్ రూరల్ మీట్‌లో బంగారు పతకాలు సాధించిన నెల్లూరు బాలికలు ఎం. శ్వేత, సురేష్ బాబు, వెండి పతకాలు పొందిన ఎ. శ్వేత, కె. వెంకట సుబ్బమ్మ, పదవ తరగతి పరీక్షలో రాష్ట్రంలో ప్రథములుగా నిలిచిన హాజరత్తయ్యలకు కలెక్టర్ పతకాలు బహూ కరిస్తున్నప్పుడు జిల్లా జడ్జి కె. అప్పారావు, ఇతర న్యాయమూర్తులు చప్పట్ల వర్షం కురిపించారు.

కూడా పట్టుకొని కుంగా తన్నారు.

ఈ పాప డికె కాలేజి ఇంటర్ విద్యార్థిని; తల్లి దండ్రులకు ఒకటే కుమార్తె. ఆమె తండ్రి నిప్పోలో వుద్యోగి. తోటి కార్మికుడి కుటుంబానికి జరిగిన ఘోర అన్యాయం చూసి చలించి పోయిన నిప్పో కార్మికులు ఫ్యాక్టరీ వదలి బయటకు వచ్చి; టౌన్ బస్‌లు, లారీలు టౌన్‌లోకి రావడానికి లేదని సత్యాగ్రహం చేశారు. కానీ సాయంత్రానికి అంతా మామూలే; అన్నీ యథా ప్రకారం తిరుగు తున్నాయి.

ఏకైక కన్న కూతురును కోల్పోయి హృదయ విదారకంగా వారు విలపిస్తున్న దృశ్యం చూస్తే మాత్రం అయ్యో అన్పిస్తుంది.

## సణుగుడు

7 పేజీ కొరవ

వైపులా మార్జిన్ ఛండాలంగా వుంది. బస్ కాని, లారీ కాని క్రిందకు దిగితే స్పీడు మీద అదుపు తప్పడం ఖాయం. ఆ గుంటలలో ఎగిరెగిరి పడ్తాయి. అందువల్ల ఇరుకు రోడ్డులోనే ట్రాఫిక్ మధ్య తమ బస్‌ను ఇరికించి నడప టానికి డ్రైవర్లు సర్కస్ ఫీట్లు చేస్తుంటారు. మార్జిన్ బాగుంటే వారికా బాధ లేదు. ఎప్పుడైతే ముందున్న ఆటోనో, సైకిలునో తప్పించ డానికి డ్రైవర్ స్టీరింగ్‌ను త్రిప్పుతాడో అప్పుడు అది రోడ్డుకు అవలి వైపుకు వెళ్లి పాయి జనాన్ని గుద్దే స్తుంటుంది. ప్రమాదాలకు అదీ ఒక కారణం. అప్పుడు చెప్పండి - ఆర్ అండ్ బి ఇంజనీర్లు కూడా ఈ పాప హంతకులలో ఒకరవడం నేరమా?

బైపాస్ రోడ్డు మీద 3 కోట్లు వెచ్చించారు. కాని అది మూడు వారాలు కూడా పనికి రాలేదు. ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు కలిసి డబ్బంతా దొంగలు దొంగలు ఊళ్లు పంచు కొన్నట్లు పంచుకొని తిని, కాగితాల మీద మాత్రమే రోడ్డు వేసినట్లు సృష్టించి, బిల్లులు దండు కొన్నారు. బైపాస్ రోడ్డు శుభ్రంగా వుండి వుంటే లారీలు, దూర ప్రాంతం వాహనాలు టౌన్‌లోకి రానవసరం లేదు. అవి టౌన్‌లోకి రాకుంటే ట్రాఫిక్ సమస్యలు సగం తగ్గుతాయి. కాని అది జరగడం లేదు. ఇంక ఇప్పట్లో జరగదు కూడా. జరగాలంటే బైపాస్ రోడ్డు మీద మళ్లీ మరొక మూడు కోట్లు ఖర్చు పెట్టాలి. ఎక్కడుంది డబ్బు? ఎవరు ఇస్తారు? అది వచ్చేదాకా ఈ ప్రమాదా లనబడే హత్యలు తప్పవు. ఇప్పుడు చెప్పండి - ఈ పాప చావు ఉసురు ఈ కాంట్రాక్టర్లకు, ఈ ఇంజనీర్లకు తగల దంటారా?

టౌన్ బస్ యజమానులు, ఆర్‌టిఓ అధికారులు, పోలీసులు, హైవే ఇంజనీర్లు, ఆర్ అండ్ బి ఇంజనీర్లు, మునిసిపల్ సిబ్బంది తది తరులందరూ తలా కొంచెం పాపం పంచుకొని టౌన్‌లో రోడ్ల మీద హత్యల సదగిన ప్రమాదాలు సృష్టిస్తున్నారు. వీరు తెర వెనుక ఆడించే నాటకంలో మనకు కన్పించే నటుడు డ్రైవరు. అతడు ఒక్కడిని పట్టుకొని తంతే పాపం పరిహారం కాదు. అందర్నీ పట్టి చెట్టుకు కట్టేసి కొట్ట గల్గినప్పుడు మాత్రమే ఈ నిత్య రక్త తర్పణం ఆగుతుంది. అది జరగడం ఈ దేశంలో అసాధ్యం. మన జనం ఆవేశం పట్టి తాటాకు మంట. నిన్న జరిగిన దుర్ఘటన ఈ రోజు జ్ఞప్తిలో వుండదు. అందువల్ల ఈ రోడ్డు ప్రమాదా లనబడే హత్యలు, వాటికి కారకులైన వారి నిక్షేప జీవనం సాగి పోతూనే వుంటాయి; మనం చూస్తూనే [illegible].

ఆకస్మిక తనిఖీగా దర్గామిట్టలో ఒక కాలువను పరిశీలిస్తున్న మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, ఇంజనీరు రామసుబ్బారెడ్డి, కౌన్సిలర్ రాఘవ రెడ్డి తదితరులు.

# ఎన్నో ప్రశ్నలు

మొదటి పేజీ కొరవ

చేశారు? ఎన్టీఆర్ చనిపోయింది 3 గంటలకి అనుకున్నా, డాక్టర్ మహాలక్ష్మికి ఫోన్ చేయడానికి గంట వరకు ఎందుకు ఆలస్యం చేశారు? కనీసం ఆమె వచ్చిన తర్వాత కూడా ఎన్టీఆర్‌ను పరీక్షించడానికి ఆమెను పడక గదిలోకి పంపలేదు. ఆమె వచ్చి రావడంతోటే మాజీ ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డికి ఫోన్ చేయించారు. ఆయనా, ఆమె దగ్గర బంధువులు. ఆమెను పిలిపించి, ఫోన్ చేయించి, రామారావు గారు మరణించారని, తనను ఒంటరి దాన్ని చేసి చంద్రబాబాదులు వేధించే ప్రమాదం వుంది కాబట్టి, కేంద్రం ద్వారా ఏదైనా రక్షణ కల్పించమని లక్ష్మి పార్వతి విజయ భాస్కర రెడ్డిని కోరారట. అంత గొప్ప వ్యక్తి తన పక్కలో, తన కళ్ల ఎదుట తుది శ్వాస విడిస్తే ఆ షాక్ తట్టుకోలేక దుఃఖంతో మూర్ఛితురాలు కావలసిన పరిస్థితిలో ఆమె తన రక్షణకు కాంగ్రెస్ నాయకుల సహాయం కోరడం ఏమిటి? ఆమెలో ఆ భయం ఎందుకు కల్గింది? ఏదైనా తప్పు చేసిందా? అందుకే అంత భయ పడిందా?

తన ఆప్తులను, డాక్టర్ మహాలక్ష్మిని, విజయ భాస్కర రెడ్డిని సంప్రదించిన ఆమె, అదే ఇంట్లో వున్న జయ శంకర కృష్ణను ఎందుకు నిద్ర లేపలేదు? ఇంటికి కేవలం ఫర్లాంగు దూరంలో వున్న డాక్టర్ వెంకటేశ్వర రావుకు ఎందుకు తెల్పలేదు? ఎందుకంత దాపరికం? దేన్ని చూసి, ఎందువల్ల ఆమె అంత భయపడ్డారు? ఇంట్లో వున్న పోలీసులు, టెలిఫోన్ ఆపరేటరు, వంటవాడు, పని మనిషి ఇత్యాదులైనా ఎందుకు ఈ వార్తను బయటకు చేరవేయలేదు? వారి నోళ్లు ఎవరు కట్టి పడేశారు? ఎందుకు వారి నోళ్లు మూయించారు? ఏదో జరగరాని పని జరిగి వుంటేః తప్ప అందర్నీ అంతగా కట్టడి చేసి వుంటారు? చంద్రబాబు అంటే రాజకీయ శత్రువని భయపడటంలో అర్థం వుంది. కాని జయ శంకర కృష్ణ ఆమెకు హితుడే! సిటీలోనే వున్న జయకృష్ణ, రామకృష్ణ, మోహన కృష్ణ, వెంకటేశ్వర రావులు ప్రభుత్వంతో సంబంధాలు కల్గిన వారు కాదు. వారికి కూడా మరణం తర్వాత గంట, గంటన్నర పైన విషయం చెప్పలేదంటే ఏదో తప్పు జరిగిందని, దాన్ని కప్పి పెట్టు కోవడానికి ఆ వ్యవధి వాడు కున్నారని సందేహించ వలసి రావడం సహజమే కదా?

అసలు ఎన్టీఆర్ 2 గంటల ప్రాంతం వరకు బ్రతికి వున్నారనే దానికి కూడా ఆధారం లేదు. అంతకు క్రితం ఎప్పుడో ఆయన మరణించి వుండినా ఆశ్చర్యం లేదు. రాత్రి నిద్రపోయే ముందు వరకు ఆయన ఆరోగ్యం బాగుండింది. భోజనం చేశారు. టెలిఫోన్లలోనూ మాట్లాడారు. అలాగా ఏమైందన్న ప్రశ్న వల్లనే అన్ని అనుమానాలు.

ఎన్టీఆర్‌ను వెంకటేశ్వర రావారులు చూసే టప్పటికి, ఆయన వంటి మీద ధోవతి, లాల్చీ వున్నాయి. నిద్రించే సమయంలో లేదా వ్యాయామం చేసుకొనే సమయంలో ఆయనా దుస్తులు ధరించరు. ఆయన నిద్రలోనే మరణించి వుంటే, ఆ తర్వాత ఎవరో దుస్తులు మార్చి వుండాలి; లేదా నిద్రించ డానికి ముందే మరణించి వుండాలి. దుస్తులు మార్చారా? మార్చితే ఎవరు? ఒక్కరి వల్ల జరిగే పని కాదది. మరొకరి సహాయం లేకుండా శవాన్ని ఎత్తి పట్టుకొని ధోవతి కట్టడం అసాధ్యం. వారెవరు? మరణం నిద్రలో సంభ వించ లేదేమోనని అనుమాన పడితే, మరణ సమయం ఏమిటి? ఆ రాత్రి ఏ కారణం చేతనైనా ఆయన పొద్దు పోయినంత వరకు మేలుకొని వుండినారా? ఉద్రేకం కల్గించే రీతిలో ఎవరితోనైనా వివాద పడ్డారా?

దహన సంస్కారాలు జరిగి పోయిన తర్వాత చాలా నిర్భయంగా - "అనుమానం వుంటే పోస్టు మార్టం చేయించుకొని వుండ వలసింది" అని ప్రకటన చేశారు లక్ష్మి పార్వతి గారు. ఆ మాట ముందే చెప్పి వుండి, పోస్టు మార్టం జరిగి వుంటే పరిస్థితి వేరుగా వుండేది. అప్పుడు ఆ చర్య అనవసరం. కాని, ఈ చావులోని సందేహాలకు సమాధానం చెప్పగల్గిన వ్యక్తి ఆమె ఒక్కరే. ఇది హత్య అని కాని, లక్ష్మి పార్వతి హంతకు రాలని కాని అనలేము; అందుకు ఏ చిన్న ఆధారం కూడా లేదు. కాని, ఈ చావుకు, దాని పై అన్ని సందేహాలు రావడానికి మాత్రం బాధ్యత ఆమెదే! అందులో దాపరికం ఏమీ లేదు; ఆ మాట అనడం నింద కూడా కాదు. ఏదైనా ఉన్నత స్థాయి దర్యాప్తు జరిగి, లక్ష్మి పార్వతిని, ఆ రోజు ఆ ఇంట్లో వుండిన ఇతరులను, మరణం తర్వాత అందరి కంటే ముందుగా వచ్చిన వ్యక్తులను విచారిస్తే తప్ప నిజాలు వెలికి రావు.

* * *

పైన చర్చించినవన్నీ మరణ సమయ సందేహాస్పద పరిస్థితులు గాని కంటే తీవ్రమైనవి ఎన్టీఆర్‌కు వాడిన మందులు, వైద్య ప్రక్రియలు. గత వారం జమీన్‌రైతులో వ్రాసినట్లు ఎన్టీఆర్‌కు మాగ్నటిక్ థెరపి, స్టెరాయిడ్ ఇంజక్షన్లు వాడిన విషయం లక్ష్మి పార్వతి ధృవ పరిచారు. టివి ఇంటర్వ్యూలోనే ఆమె ఆ సంగతి చెప్పారు. కాని వాటిని ఆయన పై ఎందుకు ప్రయోగించారో వివరించ లేదు.

"రక్త ప్రసరణ కోసం" అని ఒక మాట అన్నారామె. రామారావు గారికి రక్త ప్రసరణ సరిగా లేదని ఏ ఆస్పత్రిలో పరీక్ష చేసి ధృవీక రించారు? ఏ డాక్టరు నిర్ధారించారు? అటువంటి టెస్ట్ రిపోర్టు లేవీ వున్నట్లు లేవు. కొందరు అనుమాన పడినట్లు ఆయనకు లైంగిక పటుత్వం కల్పించడం కోసం ఆమె రకరకాల నాటు వైద్య ప్రక్రియలు అవలంబించి వుండాలి. అందు కోసమే స్టెరాయిడ్ ఇంజక్షన్లు ఇచ్చి వుండాలి. అదే నిజమైతే రెండు సార్లు గుండె పోటు, పక్ష వాతంతో బాధ పడడంతో పాటు, గుండె ఆపరేషన్ కూడా చేయించుకున్న 74 ఏళ్ల ముదుసలికి కృత్రిమంగా నరాల పటుత్వం కల్పించి, లైంగిక ప్రక్రియకు పురికొల్పడం నేరం కాదా? ఈ తప్పు తాను చేయకుంటే లక్ష్మి పార్వతి సమాధానం ఎందుకు చెప్పదు?

* * *

ఈ సమయంలో లక్ష్మి పార్వతి ప్రవర్తన సందేహా స్పదంగా కన్పిస్తున్న మరొక సంఘటన - ధన తరలింపు. ప్రఖ్యాత పారిశ్రామిక వేత్తలైన హిందుజా సోదరులలో ఒకరు మరణానికి కొద్ది రోజుల ముందే ఎన్టీఆర్‌ను కలసి పెద్ద మొత్తంలో ఎన్నికల నిధి సమర్పించారట. లోకసభ ఎన్నికల కోసం అందరు రాజకీయ వాదులకు, రాజకీయ పార్టీలకు నిధి సమర్పించడం పారిశ్రామిక వేత్తలకు అలవాటే. అందులోనూ పాతిక, ముప్పయ్ వేల కోట్ల పెట్టుబడితో వివిధ పరిశ్రమలు ప్రారంభించ బోతున్న వారు నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్‌గా ఎన్టీఆర్‌ను మర్యాద పూర్వకంగా కలిసి నట్లున్నారు. వారు ఇచ్చిన ఎన్నికల నిధి నాలుగు కోట్లని ఒక వదంతి. ఆ డబ్బంతా ఇప్పుడేమై పోయింది? ఎక్కడికి తరలించారు?

ఎన్టీఆర్ శవాన్ని స్మశాన వాటికకు తరలించ డానికి వ్యాన్ ఎక్కించగానే లక్ష్మి పార్వతి ఇంటికి తిరిగి వచ్చేశారు వచ్చి రాగానే దేవినేని నెహ్రూ, సుచిత్ర కృష్ణంరాజు, ఎన్టీఆర్ వియ్యంకులలో ఒకరికి ఆమె సూట్ కేసులు అందించి బయటకు పంపారు. సెక్యూరిటీ పోలీసులు అభ్యంతరం చెప్తే, ఆమె స్వయంగా జోక్యం చేసుకొని వారిని బయటకు పంపించారట. ఆ సూట్ కేసులలో డబ్బు, నగలు పుష్కలంగా వుండి వుండాలి. అందువల్లే కృష్ణంరాజును అరెస్ట్ చేశారు. తను డబ్బు తేలేదని, ఎన్టీఆర్ ఇంటికి ఇదివరలో పంపించిన భోజనం క్యారియర్‌లు మాత్రమే తెచ్చానని చెప్పారు కృష్ణంరాజు. ఆయన వంటి పెద్ద మనిషి, పారిశ్రామికుడు అంత పచ్చి అబద్ధం చెప్పడం దురదృష్టకరం. రామారావు చనిపోయి, శవ సంస్కారం జరుగుతున్న సమయంలో ఆయన వంటి పెద్ద మనిషి, సంపన్నుడు, సన్నిహితుడు వంటింట్లోకి వెళ్లి, ఎంగిలి గిన్నెలు వెదుకొని, కడిగించి, చంకలో పెట్టుకొని వెళ్తాడా? నమ్మడానికి వీలు లేని కుంటి సాకు ఇది! ఆయన డబ్బు కాని, విలువైన పత్రాలు కాని తరలించి వుండాలి. అవి ఏమిటి? కోర్టు కేసు నడుస్తున్నందు కొబట్టి దీని పై చర్చించలేము.

లక్ష్మిపార్వతి ఇంటిలో వస్తువు లన్నిటినీ పోగా చేసి, జాబితా తయారు చేసి తనకు సమర్పించమని హై కోర్టు క్రింది న్యాయమూర్తిని ఆదేశించింది. ఆయన అక్కడికి వెళ్లేసరికి లక్ష్మిపార్వతి ఎన్టీఆర్ పడక గదికి తాళం వేసి అది కన్పడ లేదని చెప్పారట. అంతకు క్రితం వరకు తెరిచి వుండిన తలుపులు అలాగా ఎందుకు మూసు కున్నాయి? అంతలోనే తాళం ఎట్లా మాయమైంది? దీన్ని బట్టి ఒక విషయం స్పష్టం. ఆ తాళం కావాలనే వేసి వుండాలి; తెలిసీ అబద్ధం చెప్పి వుండాలి. అంత అవసరం ఎందుకు వచ్చింది? ఆ గది లోపల ఏమి వున్నాయి? ఎందుకు వాటిని న్యాయమూర్తికి చూపడానికి భయ పడ్డారు? ఆ గదికి న్యాయమూర్తి సీలు వేశారు. హైకోర్టు అనుమతిస్తే తిరిగి తెరుస్తారు. అలాగా లోపలుండే "రహస్యం" అట్నే వుండి పోతుందా? లేక దాన్ని తరలించి వేయడానికి వేరే దారులేమైనా వున్నాయా?

ఎన్టీఆర్ తన స్వంత ఆస్తిని కుటుంబ సభ్యులకు ఎప్పుడో పంచి పెట్టేశారు. ఆ తర్వాత ఆయన సినిమాలలో నటించ లేదు. వేరే ఆదాయమేమీ లేదు. ఎల్‌ఐసి వంటివి వున్నా లక్షలలోనే! అటువంటప్పుడు అంతంత పెద్ద మొత్తాలలో డబ్బు ఆయన కెక్కడిది? ఎట్లా వచ్చింది? ఏ మార్గాలలో సంపా దించింది? అందులో లక్ష్మి పార్వతి స్వంత అవినీతి వాటా కూడా కలిసి వుందా? ఆయన ముఖ్య మంత్రిగా వున్న స్వల్ప కాలంలో పెద్ద మొత్తం డబ్బు ఇంట్లోకి చేరిందని తెలిసి, అప్పటికి రాజకీయ సంబంధాలు కూడా లేని హరికృష్ణ లక్ష్మి పార్వతిని దబాయించి, రెండు మూడు పెట్టెలలో దాన్ని తరలించాడని కథలు చెప్పే వారు. దాని తర్వాత కూడా మళ్లీ డబ్బు చేరిందంటే ఇంక ఆ అవినీతి పరిమాణం ఎంత?

రాజకీయ స్వార్థంతో లక్ష్మి పార్వతి ఈ చావును తన కనుకూల ప్రచారాస్త్రంగా మల్చు కోవడానికి యత్నించే కొద్దీ ఇటువంటి ప్రశ్నలు సందేహాలు పెరిగి పోతున్నాయి. వీటికి తెర దించడానికైనా ఆమె నిజమేమిటో చెప్ప గల్గితే ప్రజలు సంతోషిస్తారు. లేకుంటే అనుమానాలే నిజాలై కథలు కథలుగా ప్రచారం పొందుతాయి. దాని వల్ల నష్టం ఆమెకే!

-మా ప్రత్యేక విలేఖరి

# సణుగుడు

4 పేజీ కొరవ

స్టాపులలో విశ్రాంతి తీసు కొంటున్నాయి. ఈ సమయ నిర్ణయం శాస్త్రీయంగా జరిపితే, నిదానంగా డ్రైవ్ చేసినా స్టాపుకు సక్రమంగా చేరుకో గల్గుతారు. డ్రైవర్‌కు తొందర వుండదు.

బ్రేక్ సమయంలో బస్సు కండిషన్‌ను పరీక్షించి, నిబంధనలు కఠినంగా పాటిస్తే సగం ప్రమాదాలు జరగవు. అప్పుడు బ్రేక్ ఇన్‌స్పెక్టర్ల దృష్టి ఓనర్ ఇచ్చే మామూలు పై మాత్రమే కేంద్రీక రింపబడి వుంటుంది. బస్సు బ్రేక్ సరిగా వుందా, ఇంజిన్ సామర్థ్యం ఏమిటి, టైర్లు అరిగి పోయి వున్నాయా, సస్పెన్షన్ కుదురుగా వుందా అని పరీక్షించి చూడరు. ఫలితం - బస్‌కు బ్రేక్ కొడితే ఆగడానికి అరఫర్లాంగు కావాలి; స్టీరింగ్ ఎతమకు త్రిప్పితే చక్రం కుడి ప్రక్కకు తిరుగు తుంటుంది; సైలెన్సర్ నుంచి పొగ మేఘాలు వెలువడు తుంటాయి; ముందు అద్దాలు పగిలి పోయి గాలి విసురుకు, దుమ్ముకు డ్రైవరు కళ్లు మూతలు పడుతుంటాయి. ఇంక కంట్రోలుగా బస్ నడపడం ఎట్లా సాధ్యం?

డ్రైవర్లకు సరైన విశ్రాంతి వుండదు. వారి పని వేళలు దైవ నిర్ణయాలు. రాత్రంతా షెడ్‌లో రిపేర్లు చేయించి, పొద్దున బస్ నడపాలి. ఉదయం నుంచి రాత్రి వరకు ఒక్కరే డ్యూటీ చేయాలి. డ్రైవర్‌కు విసుగు, మగత సహజం. ఆ చిరాకులో దురుకు తనం ఇంకా సహజం. ప్రమాదాలకు ఇంత కంటే కారణం ఇంకేమి కావాలి?

టౌన్ బస్‌ల ఆసోసి యేషన్ తరపున నెలకు పోలీసుకు 50 వేల రూపాయల మామూలు చెల్లిస్తు న్నారట. వివిధ పోలీస్ స్టేషన్ల సిబ్బంది, ఇన్స్‌పెక్టర్లు, సబ్ ఇన్స్‌పెక్టర్లు, ఆ పై అధికారులు, ట్రాఫిక్ విభాగం, దీన్ని పంచు కొంటారట. రోజూ చేయి చాపే పని లేకుండానట ఈ ఏర్పాటు. రేటు పెట్టి, బేరం చేసి లంచం తినే పోలీసు వ్యవస్థ టౌన్ బస్‌లను ఏ రూపంలో నియంత్రించ గలుగుతుంది? అవి వాయు మనో వేగాలతో జన సందోహాన్ని చీల్చు కుంటూ పరుగులు పెడుతూ ఇటువంటి పసి పాపలెందర్నో తమ టైర్ల క్రింద నుజ్జు నుజ్జు చేస్తున్నా నివారించే నైతికత్వం పోలీసుకు ఎక్కడి నుంచి వస్తుంది? ఓవర్ స్పీడు, ఓవర్ టేకింగ్, నడి రోడ్లో నిలపడం, రోడ్లో రన్నింగ్ రేస్ పందాలు నిర్వహించడం వంటి దుర్మార్గాలెన్ని జరిగినా చూస్తూ వూరు కోవలసిందే తప్ప ప్రశ్నించ లేరు పోలీసులు. దానికి బదులుగా వీధిన పోయే రిక్షా వాళ్లని, సన్న జనాన్ని, నోరులేని వాళ్లను నిలేసి, అవమానించి, తాము కష్టపడి పని చేస్తున్నట్లు జనాన్ని భ్రమింప చేస్తుంటారు ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్లు, కానిస్టేబిల్లు వగైరా... వగైరా..! అప్పుడు చెప్పండి ఈ పాప మరణంలోని పాపంలో పోలీసుల భాగం ఎంతో! వారు సక్రమంగా తమ డ్యూటీలు చేస్తే టౌన్ బస్‌ల దూకుడుకు కళ్లెం వేయడం పెద్ద కష్టమా?

అయ్యప్ప గుడి నుంచి ఆత్మకూరు బస్టాండు వరకు ట్రంకు రోడ్డు దురా క్రమణలతో కుంచించుకు పోతున్నది. చాలా చోట్ల రెండు బస్సులు లేదా లారీలు ఎదురెదురు వస్తే బ్రేక్ వేసుకొని నిలువు కోవలసిందే తప్ప సాఫీగా నడవ లేవు. మంచి స్పీడులో వచ్చే వాహనాలు ఆ సమయంలో పడే ఇబ్బంది అంతింత కాదు. రోడ్డుకు ఆనించి మల్టీ స్టోరీ కాంప్లెక్స్‌లు, అంగడి గదులు కడుతున్నా టౌన్ ప్లానింగ్ అధికారులు పట్టించుకోరు. పట్టించు కొంటేః వారికి లంచాలు రావు. ఒక్కొక్క కాంప్లెక్స్‌కు రెండు లక్షల వరకు లంచాల ఆమేధ్యం బొంచేసి ఆరగించిన ఆ నీచులు తమ కక్కుర్తి వల్ల రోడ్డు ఇరుకై, వాహనాలు అదుపు తప్పి ప్రమాదాలు జరుగు తాయని తెలిసినా తెలియనట్లే ప్రవర్తిస్తున్నారు. ప్రమాదాలకు ఇదీ ఒక కారణమే. అప్పుడు చెప్పండి - ఈ పాప చావులోని పాపంలో వీరి భాగం ఎంతో!

ఆర్ అండ్ బి, నేషనల్ హైవే ఇంజనీర్ల సంగ తేమిటి? రోడ్డుకు రెండు

కొరవ 6 పేజీలో

## జనవాణి

3 పేజీ కొరవ

రాజకీయ రంగానికి కూడా పూర్వు లేని లోటు. పదవీ రాజకీయ రంగంలో శ్రమ శిక్షణకు, పట్టుదలకు మారు పేరుగా, సుదీర్ఘంగా పేరొందిన వ్యక్తి, ఒక్క అనుకోని విషయంలో లొంగి పోయి తానే అమె శ్రమ శిక్షణకు కట్టు బడడం ఆశ్చర్య కరం. లక్ష్మీపార్వతి కారణంగా చివరి దశలో కుటుంబ సభ్యులందర్నీ దూరం చేసుకొని మానసిక క్షోభకు గురై, ఎన్టీఆర్ మరణించడం అభిమానులందరికీ ఆశనిపాతం వంటిది. తన జీవిత చరిత్ర వ్రాయను వచ్చిన లక్ష్మీపార్వతి తనకు అవసాన దశలో సపర్యలు చేసిందని, మరో పెళ్లి చేసుకొని కృతజ్ఞత చూపించడంలో తప్పు లేదు. కాని రాజకీయ రంగంలో ఆమెను తనకు వారసురాలిగా చేయను యత్నించడంతో ఆయనతో పాటు పార్టీ కూడా గబ్బు పట్టింది. గృహిణిగా ఎన్టీఆర్కు అండగా వుండే లక్షణాలను లక్ష్మీపార్వతి ఏనాడో వదిలి వేసింది. ఆంధ్రా జయలలిత కావాలని తహతహ లాడింది. రాజకీయాల్లో అర్హత లేని అర్భకులకు లక్ష్మీపార్వతి ఉదాహరణ. 70 ఏళ్ల ముదిమి వయసులో గుండె జబ్బు వున్న వ్యక్తికి స్టైరాయిడ్లు వాడడం తప్పుకాదని లక్ష్మీపార్వతి చెప్పడం క్షమించ రాని నేరం. పదవిలో లేక పోయినా ఎన్టీఆర్ ఇంట్లో కోట్లాది రూపాయలు గోనె సంచుల్లో దొరకడానికి లక్ష్మీపార్వతి అవినీతే కారణం. శవంతో పాటు, దహనం తరువాత ఆమె సృష్టించిన డ్రామాను ఆంధ్ర ప్రజలు టివిల్లో బాగా గమనించారు. ప్రతి మనిషికీ మరణం తప్పదు, కాని ఏ కొంత మందో చరిత్ర సృష్టించి పోతారు. అటువంటి అరుదైన అభిమాన నటుడైన ఎన్టీఆర్కు నీరాజనాలు.

నెల్లూరు -ఎస్.వి.ఎస్. కోటేశ్వరరావు

### కలియుగ భీష్ముడు ఎన్టీఆర్

ఎన్టీ రామారావు జీవితాన్ని మొత్తం ఒకసారి సింహావ లోకనం చేసుకొంటే అన్నీ సంచలనాలే కనిపిస్తాయి. శ్రమ శిక్షణతో పాటు దైవ భక్తి పరాయణుడైన ఎన్టీఆర్కు ద్వాపర యుగంలో భీష్మునికి సంప్రాప్తించిన అరుదైన మరణం లభించింది. ప్రస్తుతం ఉత్తరాయన పుణ్యకాలం నడుస్తున్నది. 18 తేది గురువారం సూర్యోదయా త్పూర్వము బ్రాహ్మీ కాలం ధనుర్లగ్నంలో మరణం అందరికీ రాదు. ఎన్టీఆర్ చనిపోయిన లగ్నంలో గురు బలం మెండు. స్వర్గారోహణకు ఆటంకాలే వుండవు. గతించిన పుణ్య పురుషుడు భీష్మాచార్యుని ముహూర్తంలో ఎన్టీఆర్కు మరణం అత్యంత అరుదైన సంఘటనగా చరిత్రలో మిగిలి పోతుంది.

నెల్లూరు -టి.వి. నారాయణ

### జనంలో రాజకీయ చైతన్యం ఎన్టీఆరే తెచ్చారు

మహా నటుడు, ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్య మంత్రి ఎన్టీ రామారావు ఆకస్మిక మరణం రాష్ట్రానికి తీరని లోటు. రామారావు గొప్ప నటుడే గాక రాజకీయ చతురుడు. ఆయన తెలుగు దేశం పార్టీని ప్రారంభించిన తరువాత ఆంధ్ర ప్రదేశ్ ప్రజల్లో ఎనలేని రాజకీయ చైతన్యం వచ్చింది. స్త్రీలకు, బలహీన వర్గాలకు, వ్యాపారస్తులకు ఎన్టీఆర్ ప్రభుత్వంలో ప్రత్యేక సదుపాయాలు కల్పించారు. అవమాన చేరవ వుండబట్టే నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్ కుర్చీలో మరణించే వరకు వుండ గలిగారు. తెలుగు రాజకీయ రంగంలో ఎన్టీఆర్ ముద్ర చరిత్ర వున్నంత వరకు చెరిగి పోదు.

నెల్లూరు -పొమ్మిన సుబ్రహ్మణ్యం

### సినిమాలకు సబ్సిడీలెందుకు?

నేడు సమాజాన్ని అన్ని రకాలుగా భ్రష్టు పట్టిస్తున్న సినీ నిర్మాతలకు ప్రభుత్వం సబ్సిడీల పేరిట లక్షలాది రూపాయలు ఇవ్వడం దారుణం. సమాజాన్ని చైతన్య వంతం చేసేవి, చిన్న పిల్లల సినిమాలకు సబ్సిడీ లిస్తే అర్థముంది. ఆంధ్రాలో తీస్తే చాలని నిబంధన పెట్టి ఫక్తు మసాలా చిత్రాలకు సబ్సిడీ పేర కోట్లాది రూపాయల ప్రజాధనం నిర్మాతల జేబుల్లో వేయడం అన్యాయం. ఈ ధనాన్ని ప్రజోపయోగ నీటి ప్రాజెక్టులకు వుపయోగిస్తే రాష్ట్రంలో పంటలైనా పచ్చగా పండుతాయి. సినిమాలకు సబ్సిడీ విధానాన్ని ప్రభుత్వం పునరాలోచించాలి.

నెల్లూరు -కె. విజయలక్ష్మి

### నరసింహకొండ పై ఆక్రమణలు

భూమికన్నా కొండ పవిత్రమని మన పెద్దలు ఎంచడం వల్లే పవిత్రా లయాలైన తిరుపతి, శ్రీశైలంలలో వెలసిన వెంకటేశ్వర స్వామి, భ్రమ రాంబికా మల్లి ఖార్జున స్వామి దేవాలయాలు భక్తుల రద్దీతో కిటకిట లాడు తుంటాయి. మన జిల్లాలో వేదగిరి పై వున్న నరసింహ క్షేత్రం కూడా దినదిన ప్రవర్థ మాన మవుతున్నది. ఇటీవల ఈ కొండ మీద అసహ్యంగా కొన్ని గుడిసెలు వెలుస్తున్నాయి. దురాక్రమణ దారులు దేవస్థానం పెద్దల అండ దండలతో ఈ పనిని నిరాటంకంగా చేస్తున్నారు. ఈ గుడిసెలు అనేక దుర్వ్యసనాలకు ఆల వాలమై వున్నాయి. ఆలయ నిర్వహణాధి కారులు వెంటనే జోక్యం చేసుకొని ఆక్రమణల బెడద నుంచి నరసింహ స్వామిని రక్షించ మనవి.

సౌత్ఆములూరు -కె. విజయకుమార్

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9674 | 5,800/- |
| 9672 | 5,000/- |
| సున్నాలు | 3,600/- |
| మొలగొలుకులు బియ్యం బస్తా | 750/- |
| బంగారు సవర (8గ్రా) | 4,240/- |
| వెండి (10 గ్రా) | 80/- |

### నీటిమట్టం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయరు | 15.2 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.1 అ |
| నెల్లూరు చెరువు | 10.9 అ |

## పంచాంగం

### గాంధీ వర్థంతి

30 తేది మంగళ వారం గాంధీ వర్థంతి

31 తేది బుధవారం భీష్మ ఏకాదశి

### ముహూర్తములు

31 తేది బుధవారం పగలు 11.40 గంటలకు మేష లగ్నమున గృహారంభ, ఉపనయన, వివాహ వ్యాపార ప్రారంభము ఇతర శుభ కార్యాలు చేయ వచ్చు.

### జనవరి తిథులు

మాఘశుద్ధ

| | | |
|---|---|---|
| తే 27 శని సప్తమి | ఉ.గ. | 9.06 వ |
| తే 28 ఆది అష్టమి | ఉ.గ. | 9.17 వ |
| తే 29 సోమ నవమి | ఉ.గ. | 9.59 వ |
| తే 30 మంగళ దశమి | ఉ.గ. | 11.11 వ |
| తే.31 బుధ ఏకాదశి | ప.గ. | 12.49 వ |

### ఫిబ్రవరి తిథులు

| | | |
|---|---|---|
| తే 1 గురు ద్వాదశి | ప.గ. | 2.52 వ |
| తే 2 శుక్ర త్రయోదశి | ప.గ. | 4.52 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

## అశ్రుతర్పణం



ప్రేమాదరణలకు ప్రతిరూపం

# శ్రీమతి ఆవుల శ్రీదేవమ్మ

(స్వర్గీయ ఆవుల సుందర రామరెడ్డి గారి భార్య - బుచ్చిరెడ్డి పాళెం)

నూట ఐదు వసంతాల పరిపూర్ణ జీవితం గడిపి 20.1.96 తేది శనివారం విశాఖ పట్నంలో పరమపదించారు.

## పెద్ద కర్మ

31.1.96 తేది బుధవారం విశాఖ పట్నం M.V.P. కాలనీలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుతాము.

**- ఆవుల చంద్రశేఖర రెడ్డి,** (రెడ్డి&రెడ్డి స్థాపకుడు)

కుమారులు - కోడళ్ళు

స్వర్గీయ ఆవుల సుబ్బరామరెడ్డి గారి భార్య రమణమ్మ

ఆవుల శేషారెడ్డి - స్వర్గీయ సులోచనమ్మ

ఆవుల చంద్రశేఖర రెడ్డి - డాక్టర్ సులోచనమ్మ

కుమార్తెలు - అల్లుళ్లు

స్వర్గీయ ఏలూరు నాగభూషణమ్మ - హరిశ్చంద్రారెడ్డి

స్వర్గీయ రేబాల ముద్దుకృష్ణారెడ్డి లక్ష్మికాంతమ్మ, మోడెం శారదమ్మ - వెంకారెడ్డి

మనుమలు

Er. ఏలూరు శ్రీనివాసులు రెడ్డి - Dr. సిరిరెడ్డి

ఆవుల నందకుమార్ రెడ్డి - భారతి

Dr. రేబాల సుబ్బరామరెడ్డి - పద్మ

రేబాల సుధాకర రెడ్డి - భారతి

ఆవుల భాస్కరరెడ్డి

ఆవుల సాయిమోహన్ రెడ్డి - ఇందిర

Er. మోడం సాయికుమార్ రెడ్డి - స్వర్ణలత

ఆవుల గోవర్థన్ రెడ్డి - డా. సాయిలీల

మనుమరాండ్రు

డా. సుజాత, డా. సిరిరెడ్డి

వేణుంబాక జ్యోతి, డా. సాయిలీల

డా. హరిత, డా. విజిత

మునిమనుమలు మనుమరాండ్రు

మహేష్ హిమజ, డా.మీన

దినేష్, డా.నవీన్ లక్ష్మి, కీర్తి, చందన

పవన్ కుమార్ డాలి, దీప, మన్విత

నిశ్చిత,కార్తీక్, రాజేష్

# నా పెళ్ళి, నా యిష్టం- పెళ్ళికి ముందే కలిసి తిరగడమూ నా కిష్టమే!

- రోజా డోన్ట్ కేర్!

"సినిమా రంగంలో ప్రవేశించ డానికి ముందూ, అప్పుడూ వాటో మార్పేమీ లేదు. కాని, ఒక్కటి - అప్పుడు నా పేరు శ్రీలత. ఇప్పుడు రోజాగా మారింది. అదే మార్పు. నాకు ఏది మంచిదని పిస్తుందో అదే చేస్తాను. అది తప్పు అని నాకెవరైనా చెప్పినా, వారించినా లెక్క చేయను. డైరక్టర్ సెల్వమణికి, నాకు మనసులు కలిశాయి. ఒకరి కోసం ఒకరం పుట్టా మనుకున్నాం. పెళ్ళి చేసు కోవాలను కున్నాం. అందుకు సమయం కలిసి రావాలనే ఉద్దేశ్యంలోనే ఇద్దరమూ ఉన్నాం. నటిగా నేను బిజీ. తమిళ చిత్రాల డైరక్టర్‌గా ఆయన బిజీ. ఇద్దరికీ ఎప్పుడైనా తీరిక లభిస్తే, ఏ షాపింగ్‌కో వెళ్తాం. అది తప్పా! ఆ విషయం గురించి నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటే ఐ డోన్ట్ కేర్. ఏనాటి కైనా మేము భార్య భర్తలం కావలసిన వాళ్ళమే కదా?" అంది రోజా నవ్వుతూ.

"మీ భవిష్యత్తు గురించి ఇంకా ఏమైనా ప్లాన్‌లు ఉన్నాయా?" అని అడిగితే

"చూడండి. మనం ఏవేవో అనుకుంటాం; అవన్నీ జరుగుతాయా? నేను డాక్టర్ అవ్వాలను కున్నాను. అందుకు తగ్గ సబ్జెక్ట్‌లనే ఎన్నుకున్నాను. ఇంతలో మా నాన్న గారిని తరచూ చూడడానికి వచ్చే డైరక్టర్ డాక్టర్ శివ ప్రసాద్ నేనొక చిత్రాన్ని డైరక్ట్ చేయ బోతున్నాను. మీ అమ్మాయిని హీరోయిన్‌గా వేయాలని ఉంది ఆలోచించక ఒప్పేసుకోండి అన్నారు. ఆ చిత్రం ప్రేమ తపస్సు; ఆ చిత్రంలో ఒక్కదానిలో నటించి మానేద్దామనుకున్నా. కాని, ఆ చిత్రం సక్సెస్ అయ్యే సరికి నాలుగైదు చిత్రాల్లో బుక్ చేయడానికి నిర్మాతలు వచ్చారు. ఎలా కాదని చెప్పేది? శ్రమ, గ్లామర్, ఓపికతో పాటు అదృష్టం కూడా ఉండాలి ఈ ఫీల్డులో! అదృష్టం లేకుండా మిగతా మూడు అర్హతలూ ఉన్న వారు ఎంత కాలంగా ప్రయత్నిస్తున్నా అదృష్ట దేవత కనిక రించనందు వల్ల పైకి రాలేక పోయారు. సో మన చేతుల్లో ఏమీ లేదండి. అంతా పై వాడి చలవ" అంది రోజా వేదాంత ధోరణిలో.

## మెరపు

జర్నలిస్టు నందగోపాల్ పుత్రుడు గోపిచంద్ "మిస్టర్ మాయగాడు" అనంతరం దర్శకత్వం వహించే గీతాంజలి క్రియేషన్స్ "మెరపు" చిత్రంలో ఆనంద్, విక్రమ్, కస్తూరి, వేణు మాధవ్, శివ పార్వతి, పద్మ, ఆయేషా జహీల్, మల్లికార్జున రావు పాత్రధారులు. మాటలు: కొమ్మనాపల్లి గణపతి రావు. గీతాలు: సిరివెన్నెల, చిన్నవిత్తుల, సంగీతం: రమణీ భరద్వాజ. నిర్మాత: కామినేని వెంకటేశ్వర రావు.



హలో.. నీకూ నాకూ పెళ్ళంటలో ఆలీ, ఇంద్రజ

# బ్రహ్మానందానికి బ్రహ్మానందం!

చాలా బ్రహ్మానందంగా ఉందండి. 1995 లో 79 చిత్రాలు విడుదలైతే అందులో 43 సినిమాలలో నేనున్నాను. అది రికార్డే కదా? అలా వచ్చి అలా పోయే హాస్య పాత్రలు కావు సుమండీ. కథకు అంతో ఇంతో తోడ్పడే ఫుల్ లెంగ్త్ రోల్సే చేశాను. మీరంతా నన్ను అభినందిం చాల్సిందే? అన్నారు బ్రహ్మానందం.

## అభినవరాముడు, చరిత్రకారుడు

కార్మికుడు, కర్షకుడు, కష్టజీవి, ధనికుడు, దరిద్రుడు, విరాగి, భోగి, భక్తుడు, భగవంతుడు ఇత్యాది ఎన్నెన్నో పాత్రలు ధరించిన ఎన్టీ రామారావు పరిపూర్ణ యశో విలాసుడు. అసమాన కీర్తి ప్రతిష్టల పరాకాష్ట అనుభవించి, తనలో జనాన్ని, జనంలో తనను చూసుకునే దశకు పరివర్తన చెంది, ప్రజా సేవలో అలౌకిక ఆనందం అనుభవించే అత్యుత్తమ దశకు చేరుకున్నారు. ఏ పాత్రకైనా నేను సంసిద్ధుడనే. ఏ పాత్రయినా నాలో ఇముడు తుందని. ఏ పాత్రకైనా నేను సరిపోతానని ద్వారా నిరూ పించారాయన. పౌరాణిక చిత్రాలలో ప్రజలకు మరింత చేరువ అవడ మనేది పరమాత్ముడు నాకు ప్రసాదించిన ప్రత్యేక వరమని నా మనసు నాకు వెన్ను తట్టి చెప్పి నప్పుడల్లా నా హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కుతుంది. ఈ మానవ జన్మకు అటువంటి అసాధారణమైన సాటి లేని అదృష్టం వుంటే ఇంకేం కావాలి? అని తరచూ అనే వారాయన. ఎన్.టి.ఆర్. పౌరాణిక చిత్రాల్లో చూపిన నటన నభూతోనభవిష్యతి. విశేష ప్రజాదరణ గల మహా నటుడవడం వల్లే రాజకీయాలలో ప్రవేశించి ప్రియతమ నాయకు డయ్యారు. తనకంటూ విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్న మహోన్నతుడు, అలుపెరుగని ప్రజా సేవకుడు, మొక్కవోని పట్టుదల, రాజీ పడని ధోరణిలో లక్ష్య సాధన ఆయన ప్రతిభలు. గ్రామీణ మహిళలు చేపట్టిన సారా వ్యతిరేకోద్యమాన్ని ఆయన బలపరచడమే ఆయన పేద ప్రజల పక్షం అనే విషయాన్ని స్పష్టం చేసింది. జన సమీకరణ వ్యూహం ఆయనతోనే కొత్త మలుపు తిరిగింది. అధికారంలో వున్నా, లేక పోయినా ప్రజలు ఆయన వైపే చూస్తూ వచ్చారు. ఆయన అకాల మరణానికి యావజ్జాతి దిగ్భ్రాంతి చెందింది. ఒక గొప్ప నక్షత్రం రాలి పోవడం అత్యంత బాధాకరం. కాని, ఆయన ప్రజల గుండెల్లో చిరంజీవిగా మిగిలి పోతారు. "తారక రాముని కీర్తి ఆచంద్ర తారార్కం నిలుస్తుంది" అన్నారు - ఆయన సరసన "మల్లీశ్వరి" చిత్రం నుంచి "తాతమ్మ కల" చిత్రం వరకు నటించిన నటనలో ఆయన సరిపోటీ అయిన డాక్టర్ భానుమతీ రామకృష్ణ అశ్రుపూరిత నయనాలతో ఆమె ఆయనకు అంజలి ఘటించారు.

ఆరబోసిన అంగాంగాల అందాల చిందులతో సందడిగా వుంది

# పెళ్ళి సందడి

**చిత్రసమీక్ష**
**సి. నారాయణ రావు**

కనువిందైన పాటల చిత్రీకరణలో, హృదయాలు ఉప్పొంగే సన్నివేశ సృష్టితో ప్రేక్షకుడిలో ఆసక్తి పెంపొందించి ఆద్యంతం ఏకబిగిన వీక్షించి ఆనందించేలా తయారు చేసిన అద్భుత ప్రేమ కథా చిత్రం పెళ్ళి సందడి. సంక్రాంతికి తెలుగు లోగిళ్ళను నవ్వులతో, లవ్వులతో హోరెత్తించి, తెలుగు హృదయాల్ని సమ్మోహితుల్ని చేసిన రాఘవేంద్రుడు అభినంద నీయుడు.

సినిమా పేరు పేలవంగా ఉంది కాని కథ, కథనం పటిష్టంగా వున్నాయి. కుర్రకారును హుషారెక్కించే అందాల ఒలకబోత సైతం కనువిందు చేస్తుంది. పాటలన్నీ చాలా రోజులు గుర్తుండి పోయేలా ఉన్నాయి.

ఊహల్లో విహరిస్తూ సౌందర్య లహరి అని పాడుకుంటూన్న విజయ కృష్ణకు ఒక్కసారి తన ఊహా సుందరి "స్వప్న" కనుల ముందు ప్రత్యక్షం కాగానే, తాను పెద్దల బలవంతం మీద అప్పటికే పెళ్ళికి ఒప్పుకొన్న కళ్యాణిని చేసుకో నంటారు. విజయ కృష్ణ స్వప్న ఒక్కటై తిరుగుతారు. విజయ కృష్ణ తన అక్కకు కాబోయే భర్త అని తెల్సిన స్వప్న తన ఆరోగ్య పరిస్థితి పై నాటక మాడి కృష్ణను కళ్యాణితో పెళ్ళికి ఒప్పిస్తుంది. వారి ప్రేమ వృత్తాంతం తెలిసి కళ్యాణి త్యాగంతో ప్రేమికులు ఏక మవుతారు; ఇదీ కథ.

విజయకృష్ణను పరిచయం చేస్తూ అతని స్వప్న వైభవాన్ని దృశ్యీ కరించిన తీరు చక్కగా ఆకట్టు కుంటుంది. చక్కని పాట, అందుకు తగిన విధంగా సన్నివేశ రూప కల్పన కమనీయమై రాఘవేంద్ర రావు ప్రతిభకు సంకేతంగా సాగింది.

చిన్న ప్రేమ కథను, మామూలు ప్రేమ కథను రాఘవేంద్ర రావు తన ప్రతిభతో ఆహ్లాదంగా, ఆనందంగా మలచిన తీరు అద్భుతం. ఇటువంటి సినిమాల సృష్టి రాఘవేంద్రుడికే సొంతం అనడం అతిశయోక్తి కాబోదు.

స్వప్నను తొలి పరిచయంలో పూలవాన కురిపిస్తూ దృశ్యీకరించడం చాలా హాయిగా ఉంటుంది. ఆ అందాన్ని ప్రేక్షకుడికి తన్మయత్వం కల్గేలా రూపొందించిన తీరు ప్రశంస నీయం. స్వప్న, కృష్ణల ప్రేమ ఏర్పరచిన విధానం సైతం సజావుగా వుంది.

ఒక ప్రేమికుడు మానవ బాంబుగా మారి తనకు దక్కని స్వప్న వేరొకరికి దక్కకూడదనే కసితో తానే బలైపోయిన విధానం, మానవ బాంబును ప్రేమ కథల్లో ప్రయోగించడం వైవిధ్యానికి నిదర్శనం.

స్వప్న, కళ్యాణిలు ఫోటోల కోసం పడే పోటీలో కృష్ణ ఫోటో నీళ్ళలో పడడం, కుక్క పర్సు దొంగ లించడం, చెట్టు తన స్నేహితురాలిగా స్వప్న, కళ్యాణి ఇరువురు చెప్పడం వంటి సన్నివేశాల్లో దర్శకుని సమర్థత ద్యోతక మవుతుంది.

పప్పు సోదరుల హాస్య విన్యాసం, కాఫీలు తాగారా, టిఫినీలు తిన్నారా అని మాటి మాటికీ ప్రశ్నిస్తూ స్టైలు గిన్నెల్ని అపహరించే హాస్య మూకాల పరపొక్కులు మరింత వినోద ప్రధానా లయ్యాయి

కొంప 11 పేజీలో

## ముత్యాల సుబ్బయ్య కొత్త చిత్రం

ఒక హీరో ఇద్దరు హీరోయిన్‌లతో విరివిగా చిత్రాలు వస్తున్న ఈ రోజుల్లో ఇద్దరు హీరోలు ఒక హీరోయిన్‌తో వస్తూన్న వసంత్ ఆర్ట్స్ వారి చిత్రానికి నెల్లూరీయుడు

కొరప 11 పేజీలో

# నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

నిధులు ఖర్చుచేసి వచ్చిందని, బాకీలు పుంజేవారు కట్ట బోస్ అభివృద్ధి రోహర పథకాలున్నారు. జవహర్‌లెంప్ పథకం ద్వారా 7.50 కోట్లతో ప్రతిపాదనలు పంపినట్లు చెబుతూ ఇందులో 5.11 కోట్ల రూపాయలతో షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణం చేయాలని తీర్మానించినట్లు చెప్పారు. ముఖ్యమైన రోడ్ల జంక్షన్‌లలో హై మాస్ట్ లైట్లు 61 లక్షల వ్యయంతో వేయాలని కౌన్సిల్ ఏకాభిప్రాయానికి వచ్చిందట. బైపాస్ రోడ్డులో 2 కోట్ల వ్యయంతో నిర్మించే మార్కెట్‌కు త్వరలో శంకుస్థాపన చేయిస్తానని వివేకా చెప్పారు. పథకాలు ప్రణాళికలు బాగానే వున్నాయి; వీటి అమలుకు ఛైర్మన్ కృషి చేస్తే పేరు చిరస్థాయిగా నిలుస్తుంది.

## పార్వతి ఒత్తిడివల్లే మనస్తాపం - మరణం!

మార్కెటింగ్ మంత్రి, అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘాల అధ్యక్షుడు టి. రమేష్ రెడ్డి ఎన్టీఆర్ చితాభస్మ కలశం పెట్టిన కో ఆపరేటివ్ బ్యాంకు ఆవరణలో 24 తేది విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి లక్ష్మీపార్వతి పై ఆరోపణల వర్షం కురిపించారు. ఎన్టీఆర్ మరణానికి లక్ష్మి పార్వతి కారణమంటూ, ఆయన చనిపోయే మూడు రోజుల ముందు నుండి తనను రాజ్యసభకు పంపాలని, లేకుంటే పార్టీలో వున్నత స్థానం కల్పించాలని ఎన్టీఆర్ పై తీవ్ర వత్తిడి తెచ్చినట్లు చెప్పారు. దాన్ని తట్టుకోలేక తీవ్ర మనస్తాపానికి గురైన ఎన్టీఆర్, చనిపోయిన 18 తేది నటుడు అక్కినేని నాగేశ్వర రావు నిర్మాత డి. రామానాయుడుకి బాధను చెప్పుకోవాలి; ఒక సారి ఇంటికి వచ్చి వెళ్లమని అభ్యర్థించినట్లు వివరించా రాయన. నిండు నూరేళ్లు బతకాల్సిన అన్నకు ఈ వయసులో వాడకూడని మందులు వాడించి ఆరోగ్యం పాడు చేసిన దుష్ట శక్తి లక్ష్మి పార్వతేనని మంత్రి కన్నీళ్ల పర్యంత మయ్యారు. ఆమె ఎన్టీఆర్ జీవితంలోకి ప్రవేశించక ముందు వ్యవహార సరళి, ప్రవేశించిన తర్వాత ఆమె ప్రవర్తించిన తీరు, ఎన్టీఆర్ మరణానికి దారి తీసిన పరిస్థితుల పై సమగ్ర విచారణ జరిపించాలని మంత్రి డిమాండ్ చేశారు. ఎన్టీ రామారావు కడుపున పుట్టిన బిడ్డలు తర్వాత ఆయన అభిమానించేది తన వంటి అభిమానునే నన్నారు.

ఎర్ర బస్సులో వచ్చిన లక్ష్మి పార్వతిని తిరిగి అదే బస్సులో తిప్పి పంప గలనని చెప్పిన డాక్టర్ వెంకటేశ్వర రావు ప్రస్తుతం ఆమె ఆధ్వర్యంలో వున్న బస్సుకు కండక్టర్‌గా మారినట్లు ఎద్దేవా చేశారు. చంద్రబాబు వర్గంలో అసలు సిసలు ఎన్టీఆర్ రక్తం ప్రవహి స్తున్నందు ఆ పార్టీలోకి అభిమాను లందరూ తరలి రావాలని రమేష్ రెడ్డి కోరారు. సమావేశంలో వేనాటి మునిరెడ్డి, ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు కూడా పాల్గొన్నారు.

## బిజెపికి ఇక ఎదురు లేదు

రాష్ట్రంలో తెలుగు దేశం అధినేత ఎన్టీ రామారావు మరణం భారతీయ జనతా పార్టీకి అనుకూలంగా మారుతుందని ఆ పార్టీ జాతీయ కార్యదర్శి ఎం. వెంకయ్య నాయుడు అభిప్రాయ పడుతున్నారు. రాబోయే పార్లమెంటు ఎన్నికల్లో కేంద్ర, రాష్ట్ర స్థాయిల్లో తమ పార్టీ తిరుగులేని పార్టీగా నిలుస్తుందని 21 తేది నెల్లూరులో పత్రికల వారికి చెప్పారాయన. ఇప్పటికే కాంగ్రెస్ పార్టీ పలు కుంభ కోణాలలో చిక్కి శల్యమై పోయింది. రామారావు మృతితో తెలుగు దేశం పార్టీలోని వర్గాలు వ్యవహరిస్తున్న తీరు ప్రజలకు వెగటు పుట్టిస్తున్నది. జాతీయ స్థాయిలో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయం కాగల దనుకొన్న నేషనల్ ఫ్రంట్ చీలికలు, పీలికలై బలహీనమై, ఎన్టీఆర్ మరణంతో నిర్వీర్యమై పోయింది అందువల్ల జాతీయ స్థాయిలో ప్రధాన పోటీ బి.జె.పి., కాంగ్రెస్ పార్టీల నడుమే వుంటుందని, రాష్ట్రంలోనూ అదే స్థితి కొనసాగక తప్ప దన్నారాయన.

1983 లో రాష్ట్రంలో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా ఎదుగుతున్న తమ పార్టీ దశలో ఎన్టీఆర్ రాజకీయ ప్రవేశం వల్ల కాంగ్రెసేతర శక్తులకు ఆయన ప్రధాన బిందువయ్యారు. ఆయన లేని లోటు ఇపుడు ఎవరూ పూరించలేరు కనుక కాంగ్రెసేతర శక్తులన్నీ బిజెపిని ఆశ్రయించక తప్పదన్నారు. రాష్ట్రంలో తెలుగు దేశం పార్టీ నేతలు వ్యవహరిస్తున్న తీరు అసహ్యకరమైనదిగా వుండడం వల్ల, పార్లమెంటు ఎన్నికల్లో జాతీయ సమస్యలే ప్రధానం కావడం వల్ల ప్రజలు బిజెపికే మద్దతు ఇస్తారని నాయుడు భరోసాగా చెప్పారు. రాష్ట్రంలో పార్టీ పరిస్థితిని మరింత మెరుగు పర్చేందుకు ఈ నెల 30 తేది నుండి పార్టీ జాతీయ నాయకులు అద్వానీ, వాజ్‌పేయ్, సికిందర్ భక్త్, ఉమా భారతి, శ్రీమతి సుష్మా స్వరాజ్ వివిధ జిల్లాలలో పర్యటిస్తారని చెప్పారు. ఇందులో భాగంగానే ఫిబ్రవరి 4 తేది పార్టీ మాజీ అధ్యక్షుడు మురళీ మనోహర్ జోషి నెల్లూరు వస్తున్నట్లు వెంకయ్య నాయుడు వివరించారు.

## మనిషిలో మార్పు వస్తే సమాజం బాగుపడుతుంది!

మనిషిలో మార్పు వచ్చి, నీతి నిజాయితీగా వ్యవహ రించడం నేర్చుకొన్నప్పుడే ప్రస్తుత సమాజం బాగు పడుతుందని జిల్లా జడ్జి ఎల్. అప్పారావు అభిప్రాయ పడ్డారు. 21 తేది నెల్లూరు జూనియర్ ఛాంబర్ ఏర్పాటు చేసిన అవార్డుల కార్యక్రమానికి అతిథిగా విచ్చేశాయన. మనుషుల మనస్సుల్లో మార్పు రాకుండా ప్రభుత్వం ఎన్ని చట్టాలు తెచ్చినా లాభం లేదన్నారు. పెచ్చు పెరిగిపోతున్న జనాభా, జీవన పోరాటం కోసం నేరాలు చేయడం సమాజంలో భాగమై పోయిందన్నారు. కొన్ని సమయాల్లో కోర్టులు కూడా న్యాయం చేయలేని పరిస్థితి నెల కొంటున్నదని న్యాయమూర్తి నిజాయితీగా ఒప్పుకొన్నారు. తాను వేరే జిల్లాలో పని చేస్తున్నప్పుడు తన కళ్ల ముందే నడి రోడ్డులో ఒక వ్యక్తి ఒక మహిళను కత్తితో పొడవడం జరిగిందని; చివరికి ఆ కేసు తన కోర్టుకే రావడంతో కత్తి పోట్లకు గురైన మహిళ, 30 మంది సాక్షులు కూడా పొడిచిన వ్యక్తి ఎవరో తాము గుర్తు పట్టలేమని చెప్పడంతో కేసు కొట్టి వేయడం జరిగిందన్నారు. మహిళను పొడిచిన వ్యక్తి ఆమె భర్తే అయినందు వల్ల నిజం చెప్పలేదని, ఇటువంటి సందర్భాలలో కోర్టులు కూడా ఏమి చేయలేవని జడ్జి చెప్పారు. కార్యక్రమంలో నెల్లూరు జూనియర్ ఛాంబర్ అధ్యక్షుడు జి. జనార్దన రావు, వాసవి కుమారి, సుభాష్ ప్రకాష్ తదితరులు పాల్గొన్నారు.

## ప్రజాస్వామ్య నియంత!

తిరుమూరు సుధాకర రెడ్డి

ఆత్మ విశ్వాసమే శ్వాసగా
ఆవేశమే భాషగా
సంచలనమే స్వభావంగా
అహంకారమే అలంకారంగా
అమరిన అందగాడు!
వెండి తెరపై
పసిండి వెలుగై మెరసిన
మేటి చందమామ!
పురాణ పురుషుల పాత్రలకు
ప్రాణ ప్రతిష్ఠ చేసిన
ఇంద్రజాలికుడు!
తెర జీవితమ్మున దొరకని
సరికొత్త 'అన్న' పాత్రలో
రాజకీయమ్మును ప్రజా
పరమ్ము చేసిన
ప్రజాస్వామిక నియంత
కాంగ్రెస్ వైభవహంత!
రాష్ట్రాధినేతగా ఖ్యాతిగాంచినా
దేశాధినేత అయ్యేందుకు
సాహసం చేసిన స్వాప్నికుడు!
నిజ జీవితమ్మున
పొదుపు మంత్రం పఠించినా
ప్రజా జీవితమ్మున
వితరణ సూత్రం పాటించిన
సబ్సిడీల సామ్రాట్టు!
రాజర్షికి ఎక్కువై
బ్రహ్మర్షికి తక్కువై
భవబంధాల సాలెగూట్లో
సమాధియైన సంసారి!
అతడొక వైరుధ్యాల పుట్ట!
అయితేనేం?
నిజాయితీలో అతడు గిట్ట!
అతడు ఆంధ్ర దేశాన్ని
'వెలుగు'లోకి తెచ్చిన
అపర కొలంబస్!
అన్ని తరాలకు అతని జీవితం
ఆదర్శ సిలబస్!

## ఎం.జి. బ్రదర్స్‌లో టెల్కో షోరూం

దర్గామిట్టలోని ఎం.జి. బ్రదర్స్ ఆటో మొబైల్స్‌లో అన్ని హంగులతో ఏర్పాటు చేసిన టెల్కో షోరూంను 22 తేది టెల్కో డిప్యూటీ మేనేజర్ ఘోష్ ప్రారంభించారు. ఈ సందర్భంగా పత్రికల వారితో మాట్లాడుతూ 1964 లో ప్రారంభమైన టెల్కో సంస్థ స్వదేశీ పరిజ్ఞానంతో ప్రయోగాలు చేస్తూ, ఎప్పటి కప్పుడు సరికొత్త వాహనాలను తయారు చేస్తున్నట్లు చెప్పారు. తమ సంస్థ రూపొందించిన టాటా ఎస్టేట్, సియారాలకు ఇంగ్లండులో కూడా మంచి డిమాండ్ వుందన్నారు. మారుతి వలె రేటు అందుబాటులో పెట్టి అంబాసిడర్ కారును పోలిన కార్లను త్వరలో మార్కెట్ లోనికి తమ సంస్థ ప్రవేశ పెడుతున్నట్లు చెప్పారాయన. గత సంవత్సరం టెల్కో లక్షా 34వేల వాహనాలు అమ్మినట్లు తెలిపారు. ఎం.జి. బ్రదర్స్ ఎం.డి. గంగాధర్ మాట్లాడుతూ ఆరు జిల్లాల్లో తమకు బ్రాంచ్‌లు వున్నట్లు చెప్పారు. నెల్లూరు ఆఫీసును హెడ్డాఫీసుగా రూపొందించామని, 85సంవత్సరంలో సంవత్సరానికి 50 బండ్లు అమ్మే తమ ఏజన్సీ ప్రస్తుతం నెలకు 50 బండ్లు విక్రయిస్తున్న దన్నారు. తమ ఏజెన్సీలో ఒకటన్ను నుంచి 35 టన్నుల బరువు మోసే వాహనాల వరకు అమ్ము తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో టెల్కో రీజినల్ మేనేజర్ రవి శంకర్, సబ్ రీజినల్ మేనేజర్ రామారావు పాల్గొన్నారు.

## నెల్లూరు లైన్స్‌కు జతగా లియో క్లబ్

నెల్లూరు లయన్స్ క్లబ్‌లో యువకుల విభాగమైన లియో క్లబ్‌ను లయన్ డిస్ట్రిక్ట్ గవర్నర్ డాక్టర్ వై.జె. ప్రభాకర రెడ్డి 29 తేది ప్రారంభించారు. లయన్ గవర్నర్ అఫిషియల్ విజిట్‌ను పురస్కరించుకొని టౌన్‌హాల్ రీడింగు రూంలో నెల్లూరు లయన్స్ క్లబ్ ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేసింది. ఈ సందర్భంగా డిస్ట్రిక్ట్ గవర్నర్ డాక్టర్ వై.జె. ప్రభాకర రెడ్డి మాట్లాడుతూ నెల్లూరు క్లబ్ తనకు అనుబంధంగా మరో లియో క్లబ్‌ను ఏర్పాటు చేయడం ఆనంద దాయక మన్నారు. ఈ కార్యక్రమంలో క్లబ్ అధ్యక్షుడు టి. పాండు రంగం, కార్యదర్శి డి. ఉదయ భాస్కర రావు, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ వై. సురేష్, మాస్టర్ ఆఫ్ సెర్మనీస్ పి. ఆంజనేయులు పాల్గొన్నారు. లియో క్లబ్ అధ్యక్షునిగా ఎస్. రవి కుమార్, కార్యదర్శి పి. గోపాల కృష్ణ, కోశాధికారిగా టి. సురేష్‌లను ఎన్నుకొన్నారు. గూడూరు, వెంకటగిరి, ఆత్మకూరు క్లబ్బుల నుండి పలువురు సభ్యులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

## మాకు సాయపడే వారికి మా మద్దతు: పెన్షనర్లు

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ రిటైర్డ్ ఉద్యోగుల సంఘం జిల్లా శాఖ సభ్యులు 20 తేది రెవిన్యూ క్లబ్‌లో సమావేశ మయ్యారు. మాజీ ముఖ్య మంత్రి ఎన్టీ రామారావు మృతికి సంతాపం తెలియ జేస్తూ తీర్మానం చేసారు. రాబోయే ఎన్నికల్లో ఏ పార్టీ వారైతే పెన్షనర్ల సమస్యలకు ప్రాధాన్యతను ఇచ్చి, తమ ఎన్నికల మానిఫెస్టోలో ప్రకటిస్తారో వారికి పెన్షనర్ల మద్దతు ఇవ్వాలని సంఘ సభ్యులు అభిప్రాయ పడ్డారు. కార్యక్రమానికి సంఘం అధ్యక్షుడు జితేంద్రనాథ్ బాబు అధ్యక్షత వహించగా, కార్యదర్శి వెంకట సుబ్బయ్య చివరన వందన సమర్పణ చేశారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### హైపాదేవో

పతిత జనులైన హరిజన అభ్యు దయానికి వెచ్చించే నిధికి విరాళం ఇవ్వటానికి మీ చేతులు వెనక్కి ఎందుకు లాగాలి? మీ హృదయాలు ఎందుకు కరగవు? మీరు బికారులు కారే? పొట్టకు సంపాయించు కుంటున్నారే? మీ యూనిఫారం మీకు అడ్డు రాదు. మీకు వచ్చిన భయం లేదు. మీ ఇంగ్లీషు అధికారులు ప్రక్క నుంచి చూస్తారని భయపడు తున్నట్లున్నారు.



## ఉత్తరక్రియలు

### శ్రీ ఆరుగుంట రంగారెడ్డి

శ్రీ ఆరుగుంట రంగారెడ్డి గారు 15.1.96 తేది సోమవారం స్వర్గస్థులైనారు. వారి ఆత్మకు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తున్నాము. కర్మ క్రతువులు 30.1.96 తేది నిలుపు, 31.1.96 తేది బుధవారం బ్రాహ్మణ బియ్యాలు. పెద్ద కర్మ వవ్వేరు గ్రామంలో మా స్వగృహమున జరుగును. కావున తెలియ జేయడమైనది.

ఆరుగుంట కృష్ణవేణమ్మ - భార్య
ఆరుగుంట రుక్మిణమ్మ - వదిన
ఆరుగుంట వెంకురెడ్డి - సోదరుడు
ఆరుగుంట మోహన రెడ్డి - నాగిని (అన్న కుమారుడు)

కుమార్తెలు - అల్లుళ్లు

ఇందిర-చిట్టమూరు ఆదిశేషారెడ్డి
నీరజ - చిట్టమూరు సుధాకర రెడ్డి
సుకన్య - సన్నపరెడ్డి కృష్ణారెడ్డి

మంచి కథ, మంచి కథనం, మంచి నటన, మంచి దర్శకత్వం

# సంప్రదాయం

చిత్రసమీక్ష
గ్రద్దలూరు గోపాలరావు

ఎస్.వి. కృష్ణారెడ్డి దర్శకత్వం వహించిన "సంప్రదాయం" చిత్రంలో చిన్న రాజా పాత్ర చాలా ప్రధానమైంది. ఒక జమీందారీ కుటుంబానికి చెందిన పాత్ర ఇది. సాంప్రదాయానికి, పేరు ప్రతిష్టలకు, విశిష్టతను సమపార్జించిన జమీందారీ కుటుంబమిది. ఆ కుటుంబ సాంప్రదాయానికి అత్యంత గొప్ప తనాన్ని కూర్చాలనుకునే మంచి పాత్ర అది. మంచికి మారు పేరు. విలక్షణ వ్యక్తిత్వం, గంభీరమైన మనస్తత్వం గల పాత్ర అది. ఆ పాత్రను హీరో కృష్ణ తన నటనా చాతుర్యంతో పండగా పోషించాడు. రకరకాల దుస్తుల్లో చాలా నాణ్యంగా కనిపించాడు. చనిపోయిన తన చెల్లెల్ని, ఆ అమ్మాయి చని పోయిన రోజున స్మరించుకొంటూ విలపించే దృశ్యంలో కృష్ణ భావ ప్రకటన ప్రశంస నీయం. తనకు శత్రువుగా వున్న భూపతి అనే జమీందారు జైలుకు పోతూ అతని చెల్లెల్ని, తన రక్షణలో వుంచినప్పుడు ఆమెను తన స్వంత చెల్లెలుగా భావించి ఆదరించటంలోను, తాను పోగొట్టుకున్న చెల్లెల్ని, ఆమెలో చూసుకున్న దృశ్యాల్లోను కృష్ణ నటన పరాకాష్ట నందు కున్నది. దర్శకుడు కూడా చిన్నరాజా పాత్రను ప్రత్యేక శ్రద్ధతో మలిచాడు. అందువల్లనే కృష్ణ ఈ పాత్రలో గొప్పగా నిలిచాడు. కృష్ణ ఇమేజీని మరింతగా పెంచిన మరో పాత్ర ఇది.

ఈ చిత్రానికి కథను దర్శకుడు కృష్ణారెడ్డి వ్రాశాడు. చిన్నరాజా (కృష్ణ). భూపతి (దేవన్) జమీందారులు. ఇద్దరూ బద్ధ శత్రువులు. చిన్నరాజా జమీందారీ సాంప్రదాయాన్ని గౌరవిస్తాడు. మంచి మనిషిగా ప్రవర్తిస్తాడు. భూపతి అందుకు విరుద్ధం. భూపతి గోర్చు ధిక్కరణ నేరం క్రింద జైలుకు పోతాడు. పోయే ముందు చిన్నరాజా తనకు అగర్వ శత్రువైనప్పటికీ అతని మంచి తనాన్ని గుర్తించి, తన చెల్లెల్ని (మేఘన) చిన్న రాజా రక్షణలో వుంచుతాడు. "నా చెల్లెల్ని నీ రక్షణలో తాత్కాలికంగా వుంచినంత మాత్రాన నువ్వు నా తమ్ముడివి కావు, నా శత్రువే అవుతావు" అని భూపతి చిన్నరాజాతో చెప్పి తన దుష్టబుద్ధిని వెల్లడించు కుంటాడు. చిన్నరాజా, భూపతి చెల్లెల్ని తన స్వంత చెల్లెలుగా ఆదరిస్తాడు. తాను పోగొట్టుకున్న తన చెల్లెలి స్థానాన్ని ఆమెకు తన హృదయంలో యిస్తాడు చిన్నరాజా. భూపతి చెల్లెలు, చిన్నరాజా వద్ద పని చేస్తున్న గుమాస్తా (సాక్షి రంగారావు) కుమారుణ్ణి ప్రేమిస్తుంది. ఇది తెలుసుకున్న భూపతి తన చెల్లెల్ని తన వద్దకు రప్పించుకొని తన స్థాయిలో వున్న సంబంధం కుదర్చాలని నిశ్చయించు కుంటాడు. ఇంతలో బంగార్రాజా (మహేష్ ఆనంద్) అనే రౌడీ, భూపతి చెల్లెల్ని బలవంతంగా పెళ్ళి చేసుకో ప్రయత్నిస్తాడు. బంగార్రాజాను నాలుగు వాయించి, భూపతి ప్రయత్నం మాన్పించి తన మంచి తనంతో, కండ బలంతో చిన్న రాజా ఆమె వివాహం తన గుమాస్తా కుమారునితో జరిపిస్తాడు. చిన్నరాజా మీది శత్రుత్వం మానుకొని భూపతి చిన్నరాజాతో కలిసి పోతాడు.

దర్శకుడు కృష్ణారెడ్డి కథ వ్రాయడమే కాక స్క్రీన్‌ప్లే చక్కగా మలిచాడు. అంతే కాకుండా సంగీతం కూడా కమ్మగా కూర్చాడు. కథనాన్ని తన ప్రత్యేక శైలితో పటుత్వంగా నడిపించాడు. ఆక నేపథ్య సంగీతం సన్నివేశాలకు ఊపు నిచ్చింది. పాటలకూ కమ్మని సంగీతం కూర్చాడు. చిన్నరాజా కుటుంబంలో వున్న అమ్మాయి (ఇంద్రజ) చిన్నరాజాను ఊహించు కొంటూ పాడిన పాట వినసొగింది. కృష్ణారెడ్డి చిత్రం దర్శకత్వంలోను, సంగీత దర్శకత్వంలోను తన ఇతర చిత్రాల కంటే ఈ చిత్రంలో మరింత ప్రతిభ కనపర్చాడు.

**ఎన్టీఆర్**
-జయంపుకృష్ణ

అమోఘ యుక్తితో
అజేయ శక్తితో
అమమేఘాల పై తేలి
నింగికెగిరిందా రాకెట్-
బుజుమార్గంలోపాగి
లయతప్పి తృటిలోపల
లక్ష్యాన్ని చేరకుండానే
నేలకూలిందా స్పుట్నిక్-

శరత్ ఫోటోగ్రఫీ సన్నివేశాలకు, పాటల దృశ్యాలకు మంచి బలం కూర్చింది. దివాకర్ బాబు మాటలు సందర్భానుసారంగా రక్తి కట్టాయి.

కొత్త నటి మేఘన మంచి భవిష్యత్తుకు రహదారి ఏర్పరచు కున్నది. తనికెళ్ళ భరణి, బ్రహ్మానందం హాస్యం ఆనంద పరుస్తుంది. మంచి చిత్రాలు నిర్మించే సాంప్రదాయాన్ని పాటించే కృష్ణారెడ్డి అభినంద నీయుడు.

జిల్లావార్తలు 5 పేజీ కొరవ

ఎస్.ఐ. రవి కుమార్, భాస్కర్‌ను అరెస్టు చేసి కోర్టులో హాజరు పర్చారు. ఈ ప్రబుద్ధుడిని రక్షించాలని కొందరు ఉపాధ్యాయ సంఘం నాయకులు ప్రయత్నిస్తున్నారట;అది వారి వృత్తికే తీరని అన్యాయం.

## బుచ్చిలో ప్రతి వస్తువులో కల్తీ... కల్తీ!

కావేరీ కల్తీ కనర్థమంటూ బుచ్చి రెడ్డి పాళెంలోని వ్యాపారస్తులు అదూ ఆపూ లేకుండా ప్రతి వస్తువులోనూ కల్తీ చేస్తూ తమ పబ్బం గడుపు కొంటున్నారు. ఈ కల్తీలతో వ్యాపారస్తులు డబ్బును లాభాలుగా పొందు తుండగా వినియోగ దారులు జబ్బులను కొని తెచ్చు కొంటున్నారు. కల్తీ గూర్చి పట్టించుకొనే నాథుడే లేక పోవడంతో మూడు పువ్వులు, ఆరు కాయలుగా ఈ కల్తీ వ్యాపారం కొనసాగి పోతున్నది.

నిత్యావసర సరకుల కోసం బజారుకు వెడితే చాలు. పప్పులలో మూడు రకాలను వ్యాపారస్తులు వినియోగ దారులకు చూపిస్తున్నారు. వంట నూనెలు, నెయ్యి, కంది పప్పు, పసుపు, కారం, మిర్చి.. ఒకటేమిటి అన్ని రకాల నిత్యావసర వస్తువుల్లోనూ 50 శాతానికి పైగా కల్తీ సరుకులే అమ్ము తున్నారు. టీ బంకుల్లో టీ, కాఫీ పొడి కల్తీ ఎక్కువై పోయింది. కల్తీ, కాఫీ టీ పొడి తయారీ కేంద్రంగా బుచ్చి విరాజిల్లు తూంది. కూల్ డ్రింక్ షాపుల్లో చక్కెర బదులుగా సాక్రిన్‌నే వాడు తున్నారన్నది అందరికీ తెలిసిన బహిరంగ రహస్యం. స్థానికంగా వుండే పెట్రోల్ బంకులో అమ్మే పెట్రోలు, డీజిల్‌లో కల్తీ ఎక్కువ కావడం వల్ల తమ వాహనాలు తరచూ రిపేర్లకు వస్తున్నాయని వాహన దారులు వాపోతున్నారు. సారా నిషేధం తర్వాత కల్లుకి డిమాండ్ పెరగడం, కల్తీ కల్లు విక్రయాలు ఎక్కువ కావడంతో మండలంలో ఇప్పటికి ముగ్గురు అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. ఇన్ని జరుగుతున్నా స్థానిక పంచాయితీ ఆరోగ్య శాఖాధికారి గాని, జిల్లా స్థాయిలో విజిలెన్స్ శాఖ గాని, ఎక్సైజ్ శాఖ అధికారులు గాని కల్తీ గూర్చి పట్టించు కోవడం లేదు. మామూళ్లు తీసుకొని సరిపెట్టు కొంటూ ప్రజల ఖర్మ అంటూ వ్యాపారస్తులకు ఒత్తాసు పలకడం ధర్మమా? ఈ కల్తీ వ్యాపారం పై వినియోగ దారులే వుద్యమం చేపట్టడం మంచిది!

పెళ్ళిసందడి 9 పేజీ కొరవ

పాత్రలు ఎక్కువైన నిర్మాణంలో క్రమశిక్షణ కథనంలో వేగం, పకడ్బందీ చిత్రీకరణ కలసి వెరసి తక్కువ ఖర్చుతో భారీ సినిమాగా రూపొందేలా చేశాయి. మంచి సందడిని సృష్టించాయి.

ఎటొచ్చీ నగ్నత్వం ఎక్కువ కావడమే దురదృష్టకరం. యువకుల్ని హీరోయిన్ వంపు సొంపుల్తో ఇంత పచ్చిగా రెచ్చ గొట్టకుండా ఉంటే బాగుండేది! గొంగళిలో వెంట్రుకలు, రాఘవేంద్ర రావు సినిమాలో గుడ్డల్ని శృతిమించిన శృంగారం సహజమే ననుకోండి!

నటనా పరంగా శ్రీకాంత్, రవళి పాత్రోచితంగా నటిస్తే దీప్తి భట్నాగర్ అందాల ప్రదర్శనతో పాటు ప్రేమికురాలిగా చక్కని నటనను ప్రదర్శించింది. వప్పు సోదరులుగా ఎ.వి.ఎస్., బాబూ మోహన్ చక్కని హాస్యం అందించారు. బ్రహ్మానందం పాత్ర చిన్నదే! హిట్స్ అరుదైన కాలంలో కీరవాణి అన్ని పాటలనూ హిట్ చేయడం పెద్ద విజయం.

సంక్రాంతికి భలే సందడిగా రూపొందించిన పెళ్ళి సందడి అందర్నీ ఆనంద పరుస్తుంది.



నెల్లూరు ఆర్‌టిసి బస్టాండు దగ్గర డాక్టర్ పి.ఎస్. గోవర్ధన రెడ్డి ఐ కేర్ క్లినిక్ ప్రారంభిస్తున్న ప్రఖ్యాత నేత్ర వైద్యుడు డాక్టర్ అగర్వాల్

సినిమా 9 పేజీ కొరవ

ముత్యాల సుబ్బయ్య దర్శకత్వం వహించ బోతున్నారు. వినోద్ కుమార్, శ్రీకాంత్ హీరోలు. సౌందర్య హీరోయిన్. సత్య నారాయణ కీలక పాత్రధారి. ఫిబ్రవరి 11 నుంచి షూటింగ్ జరుగుతుంది.

### సంభాషణల జెరాక్స్ కాపీలు

ఇటీవల అందరూ విడ్డూరంగా చెప్పు కుంటూన్న విషయం ఒకటి. ఎ.వి.ఎం "మెరుపు కలలు"లో నటిస్తున్న వారందరికీ వారి వారి డైలాగ్‌ల జెరాక్స్ కాపీలు ముందే అంద జేశారట డైరక్టర్ రాజీవ్ మీనన్. తెలుగు సినిమా రంగం శైశవ దశలో ఇటువంటి అలవాటు ఉండేది. ఈ పద్ధతిని సినిమా రచయితలు తప్ప అందరూ మెచ్చు కుంటున్నారు. సెట్‌లో డైలాగ్‌లు రాసిచ్చే అలవాటును ఈనాటి రచయితలు ఎప్పటికి మానుకుంటారో! ఈ ఏడు ఎ.వి.ఎం. సంస్థ స్వర్ణోత్సవ సందర్భంలో విడుదలయ్యే ఈ చిత్రం తెలుగు, తమిళ, కన్నడ హిందీ భాషల్లో తయారవు తోంది. సంగీతం: ఎ.ఆర్. రెహమాన్.

### మద్రాసులో "ప్రతిజ్ఞ" షూటింగ్

ఆమని - శేఖర్ సుమన్ ల పై ఒక పాట, ఇంద్రజ - సంజయ్ భార్గవ్‌ల పై ఒక పాట, కోట శ్రీనివాస రావు - గిరిబాబు - చలపతి రావుల పై ఒక పాట జనవరి 17నుంచి మద్రాసులో చిత్రీకరింపబడ్డాయి. అట్లు కృష్ణారెడ్డి నిర్మిస్తున్న పాంచజన్య క్రియేషన్స్ "ప్రతిజ్ఞ" చిత్రానికి ఎ.పి. చంద్ర దర్శకుడు. సంగీత దర్శకుడు: రాజ్

### శోభన్‌బాబు వృత్తి విరమణ

జనవరి 14న శోభన్ బాబు అరవైలో ప్రవేశించారు. ఈయన నటిస్తున్న "హలో గురూ" ఈయన ఆఖరి చిత్రమట. "నేను సంపాదించింది చాలదా? వయసు మీరి కోర్టీ ఇంకా ఎందుకు కష్టపడాలి? అందుకే కథా నాయకుడు గానే విరమిస్తున్నాను" అన్నారు శోభన్ బాబు.

### "మాతృదేవోభవ" హిందీలో

కె. అజయ్ కుమార్ దర్శకత్వం వహించిన "మాతృదేవో భవ" చిత్రాన్ని ఆయన దర్శకత్వంలోనే హిందీలో నిర్మించడానికి అమితాబ్ బచ్చన్ కార్పొరేషన్ వారు సన్నాహాలు చేస్తున్నారు.

### బాలకృష్ణతో కోదండ రామిరెడ్డి చిత్రాలు

సబ్జెక్ట్ పకడ్బందీగా తయారైంది. మార్చి మంచి షూటింగ్ ఉంటుంది అన్నారు కోదండ రామిరెడ్డి. ఈయన దర్శకత్వం వహించే రమా ఫిలిమ్స్ చిత్రంలో బాలకృష్ణ హీరో. నటుడు కైకాల సత్యనారాయణ సమర్పించే ఈ చిత్రానికి ఆయన సోదరుడు కె. నాగేశ్వర రావు నిర్మాత.

### కలియుగ ఆంజనేయుడు

"ఒక బలవత్తరమైన కారణంగా ఆంజనేయులు కలియుగంలో ప్రవేశిస్తాడు. దుష్ట శక్తుల పని పట్టించి, రామ రాజ్యం నెలకొల్పాలని ఆశిస్తాడు. ఇందు కోసం కొందర్ని ఎదుర్కొని వాళ్లకు తగిన గుణపాఠం నేర్పుతాడు" అన్నారు కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఆంజనేయులు - టి.ఎస్.ఆర్. ఆంజనేయులు. కోట శ్రీనివాస రావు, బేబీ తేజశ్వి ఈ చిత్రంలో నటిస్తారు. సంగీతం: ఈమని శంకర శాస్త్రి. ఆంజనేయుని పాత్రను అర్జా జనార్దన రావు ధరించ వచ్చు.

### భారతీయుడు షూటింగ్

"నవంబర్ 25 నుంచి ఆస్ట్రేలియాలో పది రోజుల పాటు షూటింగ్ జరిపాం" అన్నారు ఎ.ఎం. రత్నం. ఈయన కె. శంకర్ దర్శకత్వంలో నిర్మించే "భారతీయుడు" చిత్రంలో కమల హాసన్, మనీషా కోయిరాలా, ఊర్మిళ ప్రధాన పాత్రధారులు.

# చైతన్య రథం పై హరికృష్ణ సవారీ?

ఎన్టీఆర్ మరణం తర్వాత తెలుగు దేశం రాజకీయాలు అప్పుడప్పుడే కుదుట పడుతున్నాయి. అందరూ ఊహించినట్లే ఎన్టీఆర్ స్థానంలో అధ్యక్ష కుర్చీ పై లక్ష్మిపార్వతిని కూర్చోబెట్టారు. పెద్దల్లుడ్ని ఊరికే వదిలేయకుండా వర్కింగ్ ప్రెసిడెంట్‌గా పెట్టి కష్ట కాలంలో పార్టీ తిరిగి చీలకుండా జాగ్రత్త పడ్డారు. నిప్పు - ఉప్పు వంటి దగ్గుబాటిని, లక్ష్మి పార్వతిని ఒకే ఒరలో ఒదిగేట్లు చేయడంలో ఎన్టీఆర్ గ్రూప్ ఎమ్మెల్యేలు విజయం సాధించారు. ఎన్టీఆర్ గ్రూప్ ఈ విధంగా ఐక్యతతో వ్యవహరించి చంద్ర బాబుకు సవాలు విసిరారు. లక్ష్మి పార్వతి, వెంకటేశ్వర రావుల మధ్య సంబంధాలు ఎన్టీఆర్ మరణానికి ముందు సక్రమంగా వుండేవి కావు; అందువల్ల ఆయన మరణా నంతరం ఎన్టీఆర్ గ్రూప్ చీలి పోతుందని చంద్రబాబు వర్గం పెట్టుకున్న ఆశలు తాత్కాలికంగా అడుగంటి పోయాయి. అయితే లక్ష్మి పార్వతి, డాక్టర్ వెంకటేశ్వర రావుల వ్యవహార శైలి తెలిసిన వారు మాత్రం ఎన్టీఆర్ గ్రూప్ మనుగడ ప్రశ్నార్థకమేనని అంటున్నారు. ఏది ఏమైనా వచ్చే లోక్ సభ ఎన్నికల వరకు చంద్రబాబుకు ఎన్టీఆర్ గ్రూప్ గట్టి పోటీ ఇస్తుం దనడంలో ఎవరికీ అనుమానం లేదు. లక్ష్మిపార్వతి అధ్యక్ష కుర్చీలో కూర్చున్న మరు క్షణం డాక్టర్ వెంకటేశ్వర రావును ముఖ్య మంత్రిగా చేసే వరకు విశ్రమించేది లేదని ప్రకటించి తన రాజకీయ చాతుర్యాన్ని చాటుకున్నది. తన పట్ల డాక్టర్ వెంకటేశ్వర రావు ఎటువంటి అనుమానాలూ పెంచు కోకుండా అధికార తెరపై డాక్టరే వుంటాడని చెప్పడంతో వచ్చే ఎన్నికల్లో డాక్టర్ వెంకటేశ్వర రావును తెర పై నిలుపు తారన్నది స్పష్టమై పోయింది. భోళా శంకరుడైన దగ్గుబాటికి లక్ష్మిపార్వతి ప్రకటన కొండంత ఉత్సాహాన్ని ఇచ్చింది. వచ్చే లోక్ సభ ఎన్నికల్లో గనుక మెజార్టీ స్థానాలు సంపా దించుకో గలిగితే చంద్రబాబు వర్గంలో వున్న ఎమ్మెల్యేల ఫిరాయింపు తప్పదని ఎన్టీఆర్ గ్రూప్ వారు నమ్మకంలో వున్నారు. అందుకే డాక్టర్ వెంకటేశ్వర రావును అసెంబ్లీ ఉప ఎన్నికల్లో నిలబెట్టాలన్న ఆలోచన కూడా ఉంది. ఎన్టీఆర్ కుటుంబంలో మెజార్టీ సభ్యులు చంద్రబాబుకు అండగా వుండటంతో డాక్టర్ వెంకటేశ్వర రావును ఒక పావుగా మార్చి కదపడమే ప్రస్తుత తరుణో పాయమని లక్ష్మి పార్వతి భావిస్తోంది. ఎన్టీఆర్ మరణం తర్వాత అక్కడి ఎమ్మెల్యే లంతా విధిలేక తన పంచకే చేరక తప్పదని చంద్రబాబు ఎంతో ధీమాగా వుండగా ఎన్టీఆర్ గ్రూప్ ఎమ్మెల్యేలు మాత్రం చెక్కు చెదరకుండా పోరాటానికి నడుం కట్టడంతో రాష్ట్ర రాజకీయాలు సరికొత్త పరిణామాలకు దారితీసే అవకాశ ముంది.

* ఎన్టీఆర్‌కు డూప్‌గా చూపి ఓట్లు కొల్ల గొట్టేందుకు చంద్రబాబు కొత్త పథకం!

* దగ్గుపాటి భోళాశంకరుడే!

* పార్వతి చాతుర్యం!

కాంగ్రెస్ పార్టీతో నేరుగా తలపడితే లోక్ సభ ఎన్నికల్లో ఎన్నో కొన్ని స్థానాలు సంపాదించు కోవచ్చని చంద్రబాబు భావిస్తున్నారు. ఎన్టీఆర్ లేక పోవడంతో ముఖా ముఖి పోటీ అనివార్య మనుకున్నారు. కానీ ఎన్టీఆర్ గ్రూప్ రాజీ లేని పోరాటానికి కదం తొక్కు తుండటంతో తిరిగి ముక్కోణపు పోటీ అనివార్య మవుతోంది. ముక్కోణపు పోటీ జరిగితే సహజంగానే తెలుగు దేశం పార్టీ ఓట్లు చీలి కాంగ్రెస్‌కు లాభిస్తుం దన్నది చంద్రబాబు అంచనా. ఎన్టీఆర్ మృతికి కారణంగా వచ్చే సానుభూతిని ఓట్లుగా మలచు కోవడంలో ఎన్టీఆర్ గ్రూప్ గనక సఫలీకృతమైతే చంద్రబాబుకు ''ఓట్లు పుట్టడం'' కష్టమే.

## ఫిరాయింపులకు చంద్రగాలం

లోకసభ ఎన్నికలకు ముందే ఎన్టీఆర్ గ్రూప్ ఎమ్మెల్యేల్ని తన శిబిరంలోకి లాక్కొని ఎన్టీఆర్ వర్గాన్ని నిస్తేజం చేయాలని చంద్రబాబు ప్రయత్నాలు మొదలు పెట్టారు. అందులో భాగంగానే రాజ్యసభ సభ్యుడు డాక్టర్ అల్లాడి రాజ్ కుమార్‌ను తన వైపుకు తిప్పుకో గలిగారు. అలాగే ఎమ్మెల్యేల్ని చీల్చ గలిగితే ప్రజల్లో తనదే నిజమైన తెలుగు దేశం పార్టీ అని ప్రచారం చేసుకొని ఓట్లు రాబట్టు కోవచ్చున్నది చంద్రబాబు ఆశ. ఆయన ప్రయత్నం ఫలించి కరణం రామచంద్ర రావు, బ్రహ్మయ్య వచ్చేశారు. ఇంకా పది మంది వరకు వచ్చే అవకాశం వుంది.

ఎన్టీఆర్ మరణం వల్ల వెల్లువెత్తే సానుభూతిని తనకు అనుకూలంగా మలచు కునేందుకు హరికృష్ణను పార్టీ అధ్యక్షుడిగా నియమించాలని చంద్రబాబు యోచిస్తున్నారు. హరికృష్ణను అధ్యక్షుడిగా చేసి చైతన్య రథం ఎక్కించి జనంలోకి పంపితే ఎన్టీఆర్ అభిమాను లంతా తమ పట్ల మొగ్గు చూపుతారని చంద్రబాబు భావిస్తున్నారు. లక్ష్మి పార్వతికి హరికృష్ణ అయితేనే ధీటుగా సమాధానం చెప్పగలడని చంద్రబాబు అనుకుంటున్నారు.

## సింహగర్జన యథాతథం

ఎన్టీఆర్ తలపెట్టిన సింహ గర్జన సభ ఫిబ్రవరి 15 తేదిన విజయ వాడలోనే జరపాలని ఎన్టీఆర్ గ్రూప్ నిర్ణ యించింది. ఈ సభను రాజకీయ సభగా కాకుండా ఎన్టీఆర్ సంస్మరణ సభగా ప్రచారం చేసి పెద్ద సంఖ్యలో జనాన్ని తరలించే కార్యక్రమంలో వున్నారు. ఎన్టీఆర్ లేక పోయినా ప్రజలంతా ఎన్టీఆర్ పక్షమే వున్నారని ఈ సభ ద్వారా తెలియజెప్పి లోకసభ ఎన్నికల కంఠా రావాన్ని పూరించాలన్నది ఎన్టీఆర్ గ్రూప్ వ్యూహం. చంద్రబాబును ముఖ్య మంత్రి పదవి నుంచి తప్పించాలన్న

ఎన్టీఆర్ అంతిమ కోర్కెను సాధించ టానికి కలిసి రండన్న నినాదంతో ఎన్టీఆర్ గ్రూప్ ప్రజల్లోకి వెళ్లనుంది.









### సవరణ

5.1.96 తేది జమీన్‌రైతు 7వ పేజీలో 5 కాలం శ్రీ కోట శ్రీరాములు గారి ప్రకటనలో క్లయింటు చిరునామాలో క్లయింటు పేరు వి. కృష్ణమూర్తి బదులు వి. శ్రీరామమూర్తి అని సవరించు కోమని మనవి.

మేనేజరు



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore